# గుళ్లోపెళ్లి

రచయిత:

శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారు

ప్రకాశకులు:

శ్రీ కురుకూరి సుబ్బారావు & స॥

ప్రొప్రయిటర్సు:

సరస్వతి బుక్ డిపో, బెజవాడ.

 1943. వెల 0—6—0.

మొదటి కూర్పు. 1000. స్వ॥ ఆశ్వయుజం.



## : సూచన :

పులిని చూసి, నక్క వాతలు పెట్టుకొంటే?—

ఏమయిందీ—? అలాగే అయింది కన్నబిడ్డల కడుపాకలి తీర్చడాని కతడు దొంగతనము చేసి, న్యాయస్థానంలో సత్యమును ఒప్పుకొని, ఒకానొక శ్రీమంతురాలి ప్రేమకు పాత్రు డయినాడు

అందుకని—అదేప్రతిఫలంకోసం, మరియొక స్త్రీలోలుడు, తన వేశ్యకోసం, కన్నాలు వెయ్యడానికి దిగుతే, యేమవుతుందీ???

ఇట్లు

రచయిత

స్వకీయ సరస్వతీ ప్రెస్
బెజవాడ

సెప్టెంబరు
1943

౧

ఆమెదంతా దొరసాని వాటమే!

కాని—

తెలుగు స్త్రీ లక్షణాలు ఎంత ప్రయత్నం చేసినా మరుగు పడవు.

ఆ సాంప్రదాయమే వేరు—ఆ సూచనలే వేరు—తెలుగు తేజస్సు ఎక్కడున్నా స్పష్టంగా కనబడుతూనే వుంటుంది!

ఒక సిల్కు గౌను, సాక్సు, లేడీస్ బూటు, ఒక ఫేన్సీ గొడుగు' కత్తిరింపు జుట్టు, కళ్ళకు రోల్డుగోల్డు ఫ్రేముతో వున్న అద్దాలు!

ఇదంతా దొరసాని వేషమయితే మళ్ళీ ముఖాన ఆతిలక మెందుకూ? ఇదే ఆమె తెలుగుదనం!

పరాకున చూస్తే ఆమె దొరసానిలాగునే వుంటుంది. కొంచెం పరిశీలిస్తే తెలుగు స్త్రీయే విలాసార్థం ఆ విధంగా తయారయిందని తెలిసిపోతుంది.

శచి పానగల్ పార్కులో అంతవరకూ అటూయిటూ పచార్లు చేసింది. ల్లిగాలి కోసం, కాస్త లాగాయి గాబోసు అక్కడి సిమెంటు సోఫాలో తీవిగా కూర్చుని రేడియో వింటూవుంది.

అక్కడ ఆమె ఒక్కతేగాదు - సాయంకాలం అయిదు దాటేటప్పటికి మదరాసులో చాలామంది యువతీయువకులు ఆపార్కు కొచ్చి యిచ్ఛావిహారాలు చేస్తుంటారు—విలాసంగా కబుర్లు చెప్పుకొంటారు. ఒక అందంకాదు—ఒక ఫేషనుగాదు. రకరకాలు!

సాగర్ ఆమె నంతకుముందు వారం రోజులనుంచీకూడా చూస్తూనే వున్నాడు. ప్రత్యేకం ఆమెను చూడ్డానికే అతడు నిత్యమూ ఆసమయానికి పార్కు చేరుకొంటున్నాడు. ఈవారం రోజులూ యెన్ని విధాల దరియాప్తు చేసినా ఆమె యెవరో అతనికి తెలియడం లేదు.

ఒకరోజున పార్సీలేడీ లాగున, మరియొకరోజున బెంగాలీ యువతిలాగున - మరియొకప్పుడు శుద్ధ తెలుగుస్త్రీలాగునా ఆమె రోజు

కొక వేషమును మారుస్తుండడంవల్ల ఆమెను గుర్తుపట్టలేక సాగర్ ఖంగారు పడు తుంటాడు.

ఆనాడుకూడా ఆమెను తెలుసుకోవడ మతని కెక్కువకష్టమే అయింది. పార్కంతటా తిరిగి తిరిగి కొనకు ఆమెవున్న దగ్గర కొచ్చి గుర్తు పట్టాడు.

"ఓ! యీ వేళ దొరసాని గాబోలు!" అని తనలో అనుకొన్నాడు. కొంచెం దూరంలో కూర్చుని ఆమె వయిపు తదేకధ్యానంతో చూశాడు. కాని ఆమె ఒక్కసారయినా తనముఖాన్ని అతని వయిపు త్రిప్పక పోవడంవల్ల సాగర్ నిరుత్సాహపడుతున్నాడు.

ఆ వారం రోజులలోనూ ఒకసారి—ఒక్కచూపు, ప్రస్తించి నట్లయితే అతడు మురిసి పోయేవాడు కాని అటువంటి దేమీ జరగడం లేదు.

ఆమెదృష్టిని తన వయిపు మళ్ళించు కోవడ మెలాగు? ఆమె తనతో మాటలాడు తుందా? అటువంటి అందగత్తె తనవయి పొక చల్లటిచూపు చూస్తే యెంత బాగుంటుంది? తనకు తానై ఆమెను పలకరించినట్లయితే అమర్యాదగా వుండదూ?

ఈ వారంరోజులనుంచీ ఆమెను చూసినకొద్దీ అతనికి మతి పోతూవుంది.

"ఈ సౌందర్యవతి యెవరో గొప్ప శ్రీమంతురాలై వుంటుంది. ఎప్పుడూ ఒంటరిగానే వుంటూంది. మొగవాళ్ళెవరూ లేరా? ఆమె స్వభావ మెటువంటిదో తెలియకుండా వ్యవహారం కదిపి నట్లయితే, అవమానమును పొందవలసి వస్తుందేమో—"

అని తనలో అనుకొన్న సాగర్, బుద్ధిపూర్వకంగా వెళ్లి ఆమె ముందు అటూ యిటూ పచార్లు చెయ్యడం మొదలు పెట్టాడు. మధ్య మధ్య తన క్రీగంటిచూపుల నామెపై విసురుతున్నాడు.

ఊహు! ఎన్ని చేసినా ఆమె చలించడం లేదు. అతనివయిపయినా చూడడం లేదు. అతడు నిరాశతో నిట్టూర్పులు విడుస్తున్నాడు.

అలా ఆమె ముందు పచార్లు చేస్తూ ఏ పది పదిహేను సిగరెట్లయినా తగలేసి వుంటాడు. విలువగల ఆ సిగరెట్లు మసయిపోయినట్లే, తన ప్రయత్నంకూడా మసయిపోతుందేమోనని భయపడ్డాడు.

ఏమయినా సరే. తనంతట తానే ఆమెను పలుకరించడానికి నిశ్చయించుకొన్నాడు. ఆమెకు దగ్గిరగా మరికొంచెం ముందుకు వెళ్ళాడు. కాని, సాహసించి ఆమెను పలకరించలేక పోతున్నాడు. ముందుకొచ్చి, తిరిగి వెనక్కు తగ్గుతున్నాడు. తిరిగి ధైర్యమును తెచ్చుకొని, ముందు కొస్తున్నాడు.

ఈవిధంగా ఒక అరగంట కాలం గడిచింది. కాని, శచి అతని వయిపొక్క సారయినా చూసినట్లు కనపడదు. రేడియో తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చటానికి యథా ప్రకారంగా పాడుతూవుంది. గొట్టాలనుంచి పడుతూ వున్న నీటి ధారలపైనుంచి వస్తున్న చల్లగాలులు హాయిని కలిగిస్తున్నాయి.

“పరపురుషుణ్ణి కన్నెత్తి చూడని మహాపతివ్రతా? పురుషజాతిని అసహ్యించుకొనే విరాగినియా? లేకపోతే ఇంద్రియాలను జయించగలిగిన నిగ్రహ మహాసామ్రాజ్ఞా? విషయవాంఛలకు దూరమయిన మహాయిల్లాలా?”

అయితే—?

ఈ వేషమేమిటి? ఈ షోకు లెందుకు? పారిస్‌నగరాన్నుంచి అవతరించిన నవనాగరికురాల్లావుంది. నావైపొక్కసారయినా కన్నుకొట్టదేం? నేనామెకు అందంగా కనుపించడం లేదేమో! ఏదీ? ఆమె నావైపొక్కసారయినా చూస్తేగదా, అందంగా వున్నదీ, లేనిదీ తేలేది? నాకు నేనై పలకరించినంత మాత్రాన నష్టమేముంది? అది ఒక నేర మెందుకవుతుంది? అయినా సరే, ఈమెవిషయ మేమిటో తెలుసుకోకుండా వుండలేను.” అని తనలో అనుకొని అతను తిరిగి రెండడుగులు ముందుకు వేశాడు—

కాని—

ఏమని పలకరించడం? ఏవిధంగా మాటలాడితే ఆమెకూ తనకూ

పోసుకుతుందీ? ఆమె రూపమే యింత మనోహరంగా వుంటే యిక కంఠ మెంత శ్రావ్యంగా వుంటుందో!

దానిని వినకుండా అతనుండలేక పోయాడు. ఒక్కసారి పార్కు నాలుగు వయిపులా కలయజూచాడు. తనవయిపెవరూ చూడడం లేదని గుర్తించాడు. తిరిగి యింకో కొత్త సిగరెట్టును వెలిగించాడు. లేని సాహసమును తెచ్చుకొని, ఆమెకు రెండుగజాల దూరంలో ఒక సోఫా వుంటే దానిమీద కెళ్లి కూర్చున్నాడు

అప్పటికీ ఆమె అతనివయిపు చూడలేదు.

రేడియో పాటమీదే వుందో! గొట్టాలనుండి ప్రవహించే నీటిధారల మీదనే వుందో—చెట్ల మాటున దాగి, కిలకిలారావములు చేసే పక్షిజాలంమీదనే వుందో—ఆమె దృష్టి!

అతనిపై పడలేదు—అతన్ని, చూడలేదు! అతని రాకను లెక్కచెయ్యలేదు.

"ఇంత నాజూకుగావున్న మనిషి కీవిషయంలో యింత మోటతన మేమిటీ?" అని అతడు తనలో విసుక్కున్నాడు.

"ఇష్టం లేకపోతే మాటలాడదు.—అంతేగా! నోటిమీద కొట్టదుకదా! ఏమయినా సరే, పలకరించేస్తే"—

అని తనలో తిరిగి దృఢనిశ్చయం చేసుకొని—

"మిమ్మల్ని ఒక వారం రోజులనుంచి వరసగా చూస్తున్నా!" అని కంపించే గొంతుకతో అన్నాడు.

"నాకు సిగరెట్టు పొగ గిట్టదు—అబ్బ! అవతలకు వెళ్ళండి." అని ఆమె చేతి రుమాలుతో ముక్కును మూసుకుంది.

ఖూనీ! ఆమాటతో అతను ఖూనీ అయినంతపని జరిగింది.

తక్షణం అప్పుడే వెలిగించిన సిగరెట్టును కోపంకొద్దీ విసిరి కొట్టాడు.

"ఇప్పు డిక మీ కభ్యంతర ముండ దనుకుంటా?"

"దేనికీ?"

"నే నిక్కడ కూర్చోడానికి?"

"కూర్చోకుండా చెయ్యడానికి నా కధికారం లేదు—యిది పబ్లిక్ పార్కు"

"అధికార ముంటే నన్నిక్కడ కూర్చోకుండా చేసేవారు కాబోలు!"

"ఏమో!"

"మీతో మాటలాడాలని ఈవారంరోజులనుంచీ ప్రయత్నమే."

"నాతో యేం మాటలాడాలి?"

"అబ్బెబ్బె! యేమీ లేదు!"

ఆమె అతనివయిపు చాలా తీక్షణంగా చూసింది. ఆచూపుతో అతను ఖంగారు పడ్డాడు.

"మీది యీవూరే ననుకుంటా!"

"మీకు చెప్పవలసిన అవసరం నాకు లేదు."

"లేదు లెండి!"

"మీ రిక్కడ యేం చేస్తుంటారు?"

"ఆ విషయం మీ కనవసరం."

"కాని—"

ఆమె తనముఖము నింకోవయిపు తిప్పుకొంది. రెండునిమిషాల వరకూ అతను మాటలాడ లేదు.

"పోనీ మీబస ఎక్కడో తెలుసుకో వచ్చునా?"

"మీ కెందుకు నాబస విషయం?"

అని తీవ్రంగా అనేసి ఆమె యిక అక్కడ కూర్చోలేదు. వెంటనే లేచింది.

"క్షమించండి. నామూలంగా వెళ్ళి పోతున్నార ల్లే వుంది."

అని అత నన్నాడు కాని ఆమె వినిపించుకో లేదు. జన సమర్దం యెక్కువగా వున్నచోటులోకి వెళ్ళిపోయి నిలుచుంది. సాగర్ కు ఆమె మీద చాల కోప మొచ్చింది.

"మోస్టు ఇండిఫరెంటు లేడీ—"

అని తనలో అనుకన్నాడు.

కొంచెం దూరంలో తలనిండా మల్లెపూవులను ప్రేలాడేసుకొని నడిచే మార్గమంతా సెంటు వాసనలు విరజిమ్ముకొంటూ మంద గమనంతో నడుస్తున్న లిల్లీ అతనికంట పడింది.

"హల్లో! లిల్లీ!"

అంటూ అత డామె వెనకాల పడ్డాడు. ఆమె ఆగింది.

దగ్గరగా చేరాక యిద్దరూ చెయ్యీ చెయ్యీ కలుపుకున్నారు.

"అప్పుడే యింటికేనా?" అని అత నడిగాడు.

"లేదు-నీకోసమే చూస్తున్నా. ఇంత సేపూ యెక్కడున్నావూ?" అని ఆమె అడిగింది.

"రా! అక్కడి 'వాటర్ ఫాల్సు' దగ్గర కూర్చుందాం"

అని అత డామె చేతిని తన కంఠానికి చుట్టి తీసుకుపోయాడు.

శచి దూరాన్నుంచి యీ విషయము నంతటినీ కనిపెడుతూనే వుంది!

౨

ఆ యిద్దరూ తల్లిలేని పిల్లలు!

పెద్దపిల్లకు ఏడో యేడు, చిన్నపిల్లాడికి రెండో యేడు. తమ్ముడు గుక్కపట్టి యేడుస్తుంటే అప్పగారు ఊరుకో బెట్టలేక పోతూంది. ఎత్తుకోలేక ఎత్తుకొంది! వీధి అరుగుమీదికి తీసుకొచ్చింది.

ఏడేళ్ళపిల్ల రెండేళ్ళ పిల్లాడిని ఎత్తుకోలేక పోతూంది. ఆబరువుతో యిద్దరూ చాపచుట్టగా అరుగుమీదినుంచి కింద పడిపోయారు.

అప్పగారైన అమ్మడికే యెక్కువ దెబ్బ తగిలింది. అయినప్పటికీ ఆపిల్ల తన దెబ్బను లెక్కచెయ్యకుండా ఏడిపోయిన చిట్టివాణ్ణి తిరిగి యెత్తుకొని "లేదు—లేదు—ఏడవకు నాన్నగారొస్తారు. నీ బిస్కత్తులు తెస్తారు—పాలడబ్బా తెస్తారు—" అని ఊరుకో బెట్టాలని ఎంతయినా ప్రయత్నం చేసింది. ఆమెశరీరం ముచ్చెమటలూ పోసిందంతేగాని ఆ పసికర్రాయి ఊరుకో లేదు.

"అవును - బిస్కత్తులూ - పాలడబ్బా చేతిలో కొచ్చినప్పుడు ఊరుకుంటావు. ఇప్పుడెందుకు కూరుకుంటావురా! ఇక ఊరుకోమరీ!"

అని ఆమె విసుగ్గా అనడమును చూసి ఆకుర్రాడు మరింత పెద్దగా యేడవడం మొదలుపెట్టాడు.

అవును మరి—ఒకవయిపున ఆకలిబాధ—ఇంకోవయిపున కింద పడినందువల్ల తగిలిన దెబ్బ—మరోవైపున అప్పగారి విసుగు—ఏడవ కేం జేస్తాడు? పాలడబ్బా తెస్తానని—మధ్యాహ్నం మనగా బయలు దేరిన నాన్న యింతవరకూ రాకపోతే యెలాగు?" అని తాను మహా పెద్ద ఆరిందా అయినట్లు—"ఈ కుర్రవెధవను నే నూరుకోబెట్టలేను బాబూ!" అని తిరిగి విసుక్కుంది. అప్పగారు తన్ను వెధవ అని తిడుతూ వుందన్న విషయం నోరులేని ఆపసికూనకెలా తెలిసిందో! వాడు తిరిగి మరింత గుక్కపెట్టి యేడవడం మొదలుపెట్టాడు.

తిరిగి యెత్తుకుంది. అటూయిటూ తిప్పింది. కాని కుర్రాడు వూరుకోవడం లేదు. గొంతుక బిర్రలయ్యేటట్లు యేడుస్తున్నాడు— అప్పగారి చంకలో యిముడకుండా కిందికి జారిపోతున్నాడు.

మంచి మాటలు చెబితే ఏమవు మాన్తాడేమోనని ఆలోచించింది.

"చిట్టి బాబూ! ఊరుకోతండ్రీ! నువ్విలా యేడుస్తే యెలా! మనల్ని వూరుకోబెట్టడానికి అమ్మ లేదుగదా! నాన్న యింటిదగ్గర లేడు. నువ్విలాయేడుస్తుంటే నా కూడా యేడుపొస్తూందిరా! యిక వూరుకోమరి!

ఊహూ! వాడు ఊరుకోవడం లేదు. రకరకాలుగా వరసలు పెట్టి యేడుస్తున్నాడు. రెండు రోజులనుంచి ఆకుర్రాడికి పాలచుక్కలు లేవు. ఆ కుర్రదానికి అన్నం, లేదు.

ఇద్దర కడుపుల్లోనూ కూడా ఆకలిచిచ్చు మండి పోతూనేవుంది.

అయితే - కొంచెం జ్ఞాన మొచ్చిన పిల్లగాబట్టి అమ్మడు లోలోపలనే యేడుస్తూందిగాని, పయికి యేడవడం లేదు. ఆమె మాటల్లు చెబితే వూరుకోవడానికి చిట్టిబాబుకు ఆమాత్రం జ్ఞానమయినా లేదు.

తమ్ముణ్ణి వూరుకోబెట్టలేక పోవడంవల్ల చివరకు అమ్మడికి క్కూడా యేడుపొచ్చింది. ఏడుపే గాదు చిరాకు, కోపమూ కూడాను.

చిట్టిబాబును కోపంతో ఆ అరుగుమీద కుదేసింది. తండ్రి యెక్కడ నుంచయినా వస్తున్నాడేమోనని, నాలుగువయిపులా చూసింది. అత నెక్కడా కనుపించక పోవడంవల్ల అంతవరకూ ఆమెలో అణిగున్న దుఃఖం ఒక్కసారి పొంగి పొర్లింది.

చిట్టిబాబుతో సమానంగా అమ్మడుకూడా యేడుపు ప్రారంభించింది. ఆమెను చూసి అతను—అతని యేడుపును చూసి ఆమె యిద్దరూ వెక్కి వెక్కి యేడుస్తుంటే, యిక వూరుకోబెట్టే వారెవరు!

మాసిన గడ్డము—చిరిగిపోయిన గుడ్డలు ఒంటినిండా కారుతున్న చెమటలు! ఈ బికారి వేషంతో మధ్యాహ్నం ఒంటిగంటకల్లా గోపన్ యిల్లు చేరుకొన్నాడు. కళ్ళు వాచిపోయేటట్లు ఏడుస్తున్న యిద్దర బిడ్డలనూ చూచుకొనేటప్పటికి అతనికి గుండె బ్రద్దలై పోయేటంతటి దుఃఖ మొచ్చింది. అతని కళ్లప్రయత్నంగా నీళ్లు జమ్మాయి.

ఆ తల్లిలేని బిడ్డల నిద్దరినీ చెరో చంకనూ వేసుకున్నాడు.

"అయ్యో భగవంతుడా! ఆ తల్లి యీ బిడ్డల నిద్దరినీ నా కంఠానికి చుట్టిపోయింది. నేను వీళ్ల ఆకలి బాధను తీర్చడానికూడా అసమర్థుణ్ణయిపోయాను. ఊరంతా తిరిగినా, కానిడబ్బు దొరకలేదు. అని అతడు తనలో తాను దుఃఖపడ్డాడు. తండ్రి చంక నెక్కగానే పెద్ద పిల్ల ఏడుపును మానింది. కాని, చిట్టిబాబు మాత్రం మానలేదు."

"ఎంతసేపటినుంచనుకున్నావు నాన్నా! నువ్వు వెళ్ళి నప్పటి నుంచికూడా చిట్టిబాబు యిదేవరస! ఎంతవూరుకోబెట్టినావూరుకోడు" అని అమ్మడు తన కళ్లనీళ్ళు తుడుచుకొంటూ తండ్రితో చెప్పింది.

గోపన్ యిద్దర బిడ్డలనూ హృదయానికి అదుము కొన్నాడు.

"ఏంచెయ్యను తల్లీ! ఇంతటి ప్రపంచంలోనూ మీ ఆకలి మంటను చల్లార్చగల వారొక్కరూ లేకపోయారు." అని అమ్మడితో అనగా—

"అయితే చిట్టిబాబుకి పాలడబ్బా అయినా దొరికింది కాదా నాన్నా?"

"పాలడబ్బా కాదు గదా కానిడబ్బయినా పుట్టింది కాదమ్మా!

"మరయితే యెలాగా? చిట్టిగా దూయకోను.

"ఎందర శ్రీమంతులనో అడిగాను. ఉద్యోగస్థుల నెందరినో యాచించాను. కాని లాభం లేకపోయింది. నీకూడా యెక్కువగా ఆకలవుతూవుంది గదూ అమ్మను తల్లీ!" అని అత నడిగాను. కాని ఆమె మాట లాడ లేదు.

"మూగుణ్ణి గాకపోతే నాఅడగడ మేమిటీ? రెండు రోజులనుంచి తిండి లేకపోతే నాలాంటి పెద్దప్రాణాలే కోషిల్లి పోతాయిగదా, యిక మీలాంటి పసికూనల కెలా వుంటుందీ?" అని అతడు తనకళ్ళంట సంతతధారాపాతంగా కారే కన్నీటి ధారలను తుడుచు కొన్నాడు.

ఇంతలో చంకలోని చిట్టిబాబు కళ్లు మూశాడు. అమ్మను చూసింది.

"తమ్ముడు నిద్రోతున్నాడు నాన్నా" అంది. "ఏడి చేసిచిన ప్రాణం! శోషొచ్చింది గాబోలు—"అని పయిమీది తువ్వాలు నా అరుగుమీద పరిచి గోపన్ ఆ బిడ్డను దానిమీద పడుకో బెట్టాడు. అమ్మనుకూడా తమ్ముడి ప్రక్కనే పడుకోంది.

రెక్కలురాని ఆపసిబిడ్డల యిద్దర ముఖాల్లోకే చూస్తూవుంటే గోపన్కు ఎంత ప్రయత్నం చేసినా దుఃఖ మాగడం లేదు—

"చివర కీపసికూనల ప్రాణాలు ఆకలి మంటతో కడంటి పోతాయి గాబోలు! ఏమిటీ చెయ్యడం? ఏదారీ కనపడదు. ఈ దారుణ దరిద్ర బాధను యింకా యింకా అనుభవించ నవసరం లేకుండా ఆ పుణ్యురాలు తనరోజుల నిక చాలించుకొంది.

పిల్లలు నాపాలబడ్డారు. ఈ యిద్దర పసికూనల ఆకలిబాధనూ చల్లార్చ లేని అప్రవేజుగుణ్ణి నేను! ఏం చెయ్యను? ఎంతకాలమని యీ నోరులేని బిడ్డలను మాడ్చిచంపను?" అని ఆలోచిస్తుండగా ఇంతలో అప్రయత్నంగా అతని హృదయంలో ఏదో వొక ఆలోచన

మెఱుపులా మెఱిసింది. అతడు కొత్త ఉత్సాహమును తెచ్చిపెట్టు కొన్నాడు. "అమ్మడూ!" అని కూతుర్ని పిలిచాడు. "ఏం నాన్నా!" అంటూ ఆపిల్ల లేచి కూర్చుంది.

"ఏమీ లేదు. నే నిప్పుడే తిరిగివస్తాను. చిట్టిబాబు లేచి ఏడుస్తే కాసిన్ని మంచినీళ్ళు తాగించమ్మా—"

"మళ్ళీ యెక్కడికయినా వెళతావా నాన్నా!"

"తిరిగి యిప్పుడే వస్తా తల్లీ!"

"ఎందుకు నాన్నా! ఎవరూ యేమీ ఈయరు"

"అదికాదులే—యింకో ఆలోచన ఆలోచించా! ఈసారి తప్పకుండా డబ్బు తీసుకొస్తానమ్మా! భయంలేదు. బాబూ నువ్వూ జాగ్రత్తగా వుండండి—" అని గోపన్ తన కగుపించిన మార్గంవయిపు వడివడిగా నడిచిపోయాడు.

అప్పుడతని కళ్ళల్లోని ఒకదీక్ష నడకలోని ఒక దృఢ సంకల్పము — ముఖంలోని ఒక తీవ్రభావము — చిన్నదయినప్పటికీ అమ్మడు కనిపెట్టింది.

"నాన్న యీసారి తప్పకుండా యేమయినా తెస్తాడు; లేకపోతే అంత ధైర్యంగా చెప్పడు. అడిగిన వారందరూ లేవన్నారు గదా! ఇప్పు డెక్కడినుంచి తెస్తాడు.?

అదే తెలియకుండా వుంది.

ఎక్కడనుంచయి తేయేం తప్పకుండా తెస్తాడు. నాకు తెలుసు చిట్టిబాబుకో పాలడబ్బ, బిస్కత్తులు!మాకు కొన్ని బియ్యము—కొన్ని పప్పులూ—చాలు." మళ్ళీ కొంతకాలం గడిచి పోయింది.

మా అమ్మ చచ్చిపోతూ ఏమని చెప్పిందంటే—"అవికావాలి యివి కావాలి—అని నాన్నగారిని విసిగించకు తల్లీ! ఇక చిట్టిబాబుకు నువ్వే దిక్కు—కాబట్టి నాన్నగా రింటిదగ్గర లేనప్పుడు వాడిని జాగ్రత్తగా యెత్తుకొని ఆడిస్తూ వుండమ్మా!" అని చెప్పింది. నేను మా అమ్మ చెప్పినట్లుగానే చేస్తున్నాను. చిట్టిబాబుకొక పాలడబ్బాయే దొరక్కుండా వుంటే నా కివి కావాలి—అవి కావాలి అని పేచీలు

పెడితే, నాన్నగారు రెక్కడనుంచి తెస్తారు? అందుకనే కడుపులో గంపంత ఆకలవుతూవున్నా సరే—నాన్నగారికి చెప్పడంలేదు. అమ్మ చెప్పినట్లుగా, నేను చేస్తున్నాను.'' అని ఆ లేత హృదయంలో యింకా యెన్నెన్నో ఆలోచనలు పరుగులెత్తాయి. తండ్రియెంతకూ తిరిగి రాక పోవడం వల్ల, ఆమె చిట్టిబాబుమీద చేయేసుకొని, వాడి ప్రక్కనే పడుకొంది.

కాని—ఆకలిమంటతో భగ భగ మండే ప్రాణికి కన్నెలా మూత పడుతుంది?

## 3

"నువ్వు ఒకే ఒకమనిషిని నమ్ముకొనివుంటే యెంత బాగుం టుంది లిల్లీ!''

"బాగానే వుంటుంది కాని అలా నమ్మదగిన మనిషే యెవరూ కనుపించడం లేదు.''

"నేను లేనూ?''

"నువ్వా?'' అని లిల్లీ విరగబడి నవ్వడంమొదలు పెట్టింది—

"ఏం? అంత నవ్వెందుకూ? నేను నమ్మదగిన మనిషినికాదా?'' అని సాగర్ తీవ్రంగా అడిగాడు.

"నమ్మక నమ్మక నిన్నే నమ్మాలి''

"ఎందుకు గాదూ?''

"చాలు''

"ఏమంటే?''

"ఇదిగో నని మళ్ళీ నెల్లాళ్ళ క్కనుపిస్తావు. ఏ ఆడది కనుపిస్తే ఆ ఆడదాని వెనకాలే పిచ్చికుక్కలాగ పరుగు లెటతావు. నాకు చేతి గడియారం కొనిపెడతానని చెప్పావు. ఎంతకాల మయిందీ?'' అని లిల్లీ నిర్మొగమాటంగా అడుగుతూ వుంటే సాగర్ ఏమీ మాటలాడ లేకపోతున్నాడు.

"నీలాంటివాణ్ణి నమ్ముకొంటే రెండు చేతులతోనూ తినొచ్చును కూడు.''

"ఈమధ్య బిజినెస్ జోరుగా నడవడంలేదు లిలీ! అందువల్ల అన్నమాటను నెరవేర్చ లేకపోతున్నాను."

"బిజినెస్ బాగా సాగినప్పుడు మాత్రం నువ్వు వెలిగించిన గొప్ప యేముందీ? సూటూ గీటూ వయికి చూస్తే ఏఫిలిం ప్రొడ్యూసరులాగో ఏజమిందారులాగో అవుపిస్తావు. ఎప్పుడూ ఖాళీజేబూలూ నువ్వూ తయారు!"

"జమిందారులు—ఫిలిం ప్రొడ్యూసర్లూ మనకంటే యెక్కువ అఘోరిస్తున్నారా యేమిటి? వారూ యింతే."

"అయితే తీరేపోయింది—అందుచేత నే నీలాంటి ఒక్కర్ని నమ్ముకొంటే నాకు సాగదు. నాలుగు కాతా లుంటే నలుగురూ నాలుగుపదు లిస్తారు."

"అది ఆట్టేగౌరవ మయినపని గాదు."

"ఓయబ్బో! నువ్వు చేసేవన్నీ గౌరవ మయిన పనులూ—నేను చేసేవి అగౌరవములయినపనులూ గాబోలు!"

"నేనేం చేశాను?"

"సాగర్ ఫార్మసీలో అమ్ముతూవున్నవన్నీ మందు లేనా?"

"ఓ! అది బిజినెస్!"

"ప్రజల కళ్ళల్లో కారం జల్లడం బిజినెస్ అన్నమాట!"

"తప్పు లేదు."

"అటువంటిది యెక్కువకాలం సాగమంటే యెలా సాగుతుందీ? అటువంటి పాపిష్టి డబ్బు నిలవమంటే యెలా నిలుస్తుంది? సాగర్ ఫార్మశీ అని గొప్పగా మందుల కంపెనీ పెట్టావు. కేవలమూ మట్టితో చేసిన మాత్రలకు రూపాయలు గుమ్మరించు కున్నావు, ఈ వ్యవహారమంతా యెవరికి తెలీదూ?"

సాగర్ నవ్వుతున్నాడు.

"చేసిన ఘన కార్యానికి నవ్వుకూడా యెందుకూ? అంతా ఎడ్వర్టయిజుమెంటు డాబువల్ల, ఆమట్టి మాత్రలకే కొంతకాలం రూపాయలు కురిశాయి! అయితే ప్రజ లెంతకాలమని కళ్లుమూసుకొంటారు?

రంగు రంగు డబ్బాలలోనూ, షోకయిన పెట్టెల్లోనూ అమర్చి అమ్మబడే సాగర్ ఫార్మసీ మందులన్నీ, కేవలం మట్టిముద్దలని, ప్రజలు గుర్తించారు. అప్పటినుంచీ నీనోట్లో మట్టి."—

పాపం ఎల్లకాలమూ అలాగే దొంగ వ్యాపారం సాగుతుందనుకున్నారబ్బాయిగారు—నిత్యమూ అదే విధంగా మనియార్డర్లు కరుస్తాయనుకున్నారు! అందువల్ల చేతిలోని నాలుగు డబ్బులూ 'ఆప్కారీ' డిపార్టుమెంటుకు (తాగుడు కింద) చెల్లగట్టారు,

"సడెన్‌గా తోసి రాజు -- ఆటకట్టు—బోర్డు తిరగ బడింది. అంతేనా సాగర్?" అనిలిల్లీ తిరిగి పక పకనవ్వడం మొదలు పెట్టింది.

"తొందర పడకోయ్, మనరోజులు మళ్ళీ మారక పోవు."

"మళ్లీ కొత్తయెత్తేదైనా యెత్తుతున్నావా యేమిటి?"

"ఈసారి, యిటువంటి వ్యాపారా లేవీ లాభంలేదు—డబ్బు గల స్త్రీ నెవర్నయినా పట్టుకోవాలి. అప్పుడు నాదరిద్రం వొదిలి పోవాలి."

"మంచిఆలోచన! ఇటువంటి ముఖాలికే—"

"ఏం! మనలో లో టేముంది?"

"అవును ప్రపంచంలో లేని అందముంది! గొప్ప పెర్సనాలిటీ! విద్యావంతుడవు యింకా—యింకా!"

"అదృష్టం పట్టిందంటే అటువంటివేమీ అవసరం లేదు తెలిసిందా లిల్లీ!"

"సర్లే యిక నే పోవాలి—పనుంది."

"నన్ను కూడా రమ్మన్నావా?"

"ఎక్కడికి కొస్తావు?"

"మీ యింటికి"

"అవసరం లేదు."

"అదేం లిల్లీ?"

"ఈరాత్రి నాకు వేరే, యెంగేజిమెంటుంది."

"ఉంటే పాతస్నేహమే మవుతుంది?"

"ఈకబుర్లు మనదగ్గర సాగవులే—"

అని లిల్లీ వెళ్ళిపోబోతూ వుంటే సాగర్ ఆమెచెయ్యి పట్టుకొని లాగుతున్నాడు.

ఇంతలో—"దొంగ—దొంగ—పారిపోతున్నాడు. పట్టుకోండి నాపర్సు గాను జేబులోనుంచి లాగేశాడండీ!-అని శచి వేసిన కేకలు పార్కంతటా ప్రతిధ్వనించాయి.

ఆ కేకలు వినపడడ మేమిటి ఒక వ్యక్తి సాగర్ లిల్లీల ముందు నుంచి పరుగెత్తడ మేమిటి రెండూ ఒకేసారి!

సాగర్ ధైర్యంతో ఆపరుగెత్తిపోయే వ్యక్తిని పట్టుకొన్నాడు. లిల్లీ అతని చేతిలోవున్న పర్సును లాగింది.

"దొరికాడు దొంగ—ఇదిగో పర్సు"

అని లిల్లీ సగర్వంగా కేకేసే టప్పటికి పార్కు లోనివా రందరూ ఆచుట్టూ గుమిగూడారు. శచి ఖంగారుతో పరుగెత్తుకొచ్చి-

"చూస్తుండగానే యెంతపని చేశాడు! పరధ్యాన్నంగా రేడియోపాట వింటూ నిలుచున్నాను. ఆసమయం కోసం ఎంతసేపటి నుంచి కాచుకున్నాడో—గాను జేబులో వేళ్ళాడుతున్న పర్సు నిట్టే లాగేశాడు. మీరు పట్టుకోక పోయినట్లయితే పర్సులోవున్న పదిహేను వందలూ గంగా ప్రవేశం!" అని శచి సాగర్‌కు కృతజ్ఞతను తెలిపింది.

"ఇదిగో పర్సు తీసుకోండి - మీ దేనా? ఇంకా యెవరిదో అనుకున్నాను."

అంటూ సాగర్ లిల్లీచేతిలోని పర్సునందుకొని శచి కిచ్చాడు. "Thank you—" అని శచి ఆపర్సు నందుకొంది. సాగర్ ఆమెవయి పొకసారి గర్వంగా చూసాడు. ఇంతలో అక్కడ మూగిన పదిమందీ దొంగను చితక తన్నబోతుంటే—

"కొట్టకండి—పోలీసులకు కబురు చెయ్యాలిగాని, ఎవరూ యీతన్ని ముట్టుకో గూడదు—" అని శచి అందరనూ వారించి, ఆ దొంగ ముఖంలోకి పరిశీలించి చూసింది.

అది అతిదైన్యమయిన రూపం! అతను అలిసి పోయివున్నాడు.

మాసి అసహ్యంగా కనుపించే గడ్డము—చిరిగి వాలికలయివున్న గుడ్డలు—శరీర మంతటా కారుతున్న చెమట ధారలు! అతని కళ్ళ నుంచి ఎందుకో నీళ్లు కారుతుండడము నందరూ చూశారు.

"దొంగవేషం! ఏమున్నా విడిచి పెడతా ననుకొంటున్నావు గాబోలు! అరుగో! అప్పుడే తెలిసింది గాబోలు! పోలీసులు యిటే వస్తు న్నారు. వప్పగించండి." అని సాగర్ తీవ్రంగా అన్నాడు.

"ఎవరు నువ్వు?" అని శచి అతనిని అడిగింది. అతడు మాట లాడ లేదు. అతని ముఖవర్చస్సు—వాలకమూ చూస్తుంటే శచి కెందుకో జాలి కలుగుతూవుంది.

"నీపేరేమిటి? ఇటువంటి దారుణా లెంతకాలంనుంచి చేస్తు న్నావు." అని శచి అతనిని తిరిగి అడిగింది.

"నాపేరు గోపన్! ఇటువంటి పనిచెయ్యడానికి నాకిదే మొదటి సారి! నా స్థితి యెవరికి తెలుస్తుంది? నా దరిద్రబాధ నెవరు గుర్తి స్తారు!"

అని అత డొక నిట్టూర్పును విడిచి, కళ్లనీళ్లు తుడుచుకొంటుం డగా, నలుగురు పోలీసులు వచ్చి—"ఎవరు దొంగ? దొంగిలించిన ఆస్తి ఏమి?" అని అడిగారు—

అంతవరకూ గోపన్‌ను పట్టుకునే వున్న సాగర్—

"వీడేదొంగ—ఆ స్త్రీ గారుజేబులోనుంచి పర్సును చెక్కే శాడు. అందులో పదిహేనువందల రూపాయ లున్నాయట!"

అని చెప్పగా, పోలీసు లాదొంగను, శచిదగ్గరవున్న మనీపర్సునూ, స్వాధీనం చేసుకొని—

"ఈ దొంగను పట్టుకున్న వా రెవరూ?" అని అడగ్గా—

"నేనూ, ఈలిల్లీ పట్టుకన్నాము!" అని సాగర్ చెప్పగా—

"అయితే ఆస్తిగలవారు—దొంగను పట్టుకొన్నవారు స్టేష కు రావాలి." అని పోలీసులు చెప్పేటప్పటికి, సాగర్ లిల్లీలు తెల్ల బోయారు. అయినా తప్పదు. పోలీసుల ఆజ్ఞ.

దొంగగా పట్టుబడిన గోపన్‌ను పోలీసులు బంధించి ముందు

తీసుకుపోతూ వుండగా, అతని వెనుక—శచి. సాగర్, లిల్లీలు, ముగ్గురూ విధిలేక బయలుదేరారు.

శచి మార్గం పొడుగునా యేమేమో ఆలోచిస్తూనే వుంది. గోపన్ వయిపు పదేపదేసార్లు చూస్తూంది. ఎంతమంది యెన్నివిధాల అడిగినా, అతను కళ్లనీళ్లు కార్చడంకంటే యింకేమీ జవాబు చెప్పడం లేదు. అతని హృదయంలో ఏముందో యెవరికి తెలుసును?

అతను మూగవాడో పిచ్చివాడో అని పోలీసులు అనుకొని స్టేషనులో పెట్టి, నాలుగు లాఠీ దెబ్బలు కొడితే నిజానిజా లక్కడే తేల్తాయన్నారు.

౪

మరి కొంతసేపటికి అందరూ పోలీసు స్టేషను చేరుకున్నారు. పార్కులో జరిగిన చోరీనిగురించి, పోలీసులు అక్కడున్న సబినిస్పెక్టరు గారికి మనవిచేసిన అనంతరం తమదగ్గరవున్న మనీపర్సును నేరస్థుణ్ణీ హాజరు పెట్టారు.

సబినిస్పెక్టరు అందరవయిపునా ఒకసారి పశీలించి చూశాడు.

"ఈదొంగను పట్టుకొన్నది మేమేనండి." అని సాగర్ సగర్వంతో అన్నాడు.

"ఎవ రెవరు పట్టుకొన్నారు?" అని సబినిస్పెక్టరు అడిగాడు.

"నేనూ, యీలిల్లీ పట్టుకున్నామండి తరువాత పోలీసులు వచ్చారు" అని సాగర్ చెప్పాడు.

"మంచిది. ఈ మనీపర్సు యెవరిది?"

అని యిన్‌స్పెక్టరు తిరిగి అడగ్గా—

"నాదేనండీ. అని శచి కొంచెం ఖంగారుగా చెప్పింది. పోలీసు స్టేషనుకు రావడంగాని, పోలీసులతో మాటలాడడంగాని ఆమె కదే మొదటిసారి.

శచి ఆమెతో వచ్చిన సాక్షులు కుర్చీలమీద కూర్చోబెట్ట బడ్డారు. ముద్దాయి అయిన గోపన్ చేతులకు సంకెళ్లు తగిలించబడి పోలీసుల మధ్య నిలుచున్నాడు.

అప్పుడు సబ్ ఇన్స్పెక్టరు ఒక్కొక్కరిని విచారణచేసి రికార్డు చేసుకోవడం మొదలు పెట్టాడు.

"ఆస్తి గలవారు ముందుగా నే నడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పాలి—" అని అతడు శచివయిపు చూచి—

"మీ పేరు?" అని అడిగాడు.

"నాపేరు శచి"

"దొంగిలించ బడిన ఆస్తి మీదేనా?"

"అవునండి"

"ఎలా దొంగిలించబడింది?"

"నేను పార్కులో రేడియో వింటూ పరధ్యానంగా వున్నానండి. అప్పుడే దొంగ నాగౌను జేబులో వ్రేలాడుతూవున్న మనీపర్సు లాఘవంగా లాగేశాడు."

"ఆ విషయమును మీ రెప్పుడు కనిపెట్టారు?"

"తీసిన వెంటనే కనిపెట్టాను. అప్పటికే అతడు పదిగజాల దూరం పరుగెత్తాడు."

"అప్పుడు మీ రేం చేశారు?"

"దొంగ—దొంగ—నా మనీపర్సును పట్టుకు పోతున్నాడు- అని పెద్దపెద్ద కేకలేశానండి."

"ఈ మనీపర్సులో యేముందో చెప్పగలరా?"

"పదిహేను వందల రూపాయలనోట్లున్నాయిండి. అన్నీ వంద రూపాయల కాగితాలే."

అని శచి చెప్పగా సబిన్స్పెక్టరు పర్సును విప్పి అందులోని నోట్లనులెక్కపెట్టగా సరిగా పదిహేను వందలరూపాయలనోట్లున్నాయి.

"ఈ సొమ్ము మీ కెక్కడిది?"

"ఈవేళనే బ్యాంకిలోనుంచి 'విత్‌డ్రా' చేశాను. వెంటనే యింటికి వెళ్లకుండా ఆ బ్యాంకినుంచే పార్కుకు షికారు వెళ్ళాను. అందువల్ల యీదారుణానికి లోబడ్డాను."

"మీభర్త పేరు?"

"నాకు భర్త లేడు."

"వితంతువులా?"

"కాదు—అవివాహితను"

"ఈ మదరాసులో యెందుకున్నారు?"

"నాలుగు సంవత్సరాల నుంచి యిక్కడే వున్నాను."

"ఏం పనిమీద?"

"పని యేమీ లేదు."

"భుక్తి యెలా గడుస్తుంది?"

"నాకు యిళ్ళమీద నెలకు అయిదు వేలరూపాయలు అద్దెలు వస్తాయి."

"ఆ యిళ్ళెక్కడ వున్నాయి?"

"కలకత్తాలో."

"మీ కా ఆస్తంతా యెక్కడిది?"

"మా అమ్మగారిచ్చింది."

"ఆమె యిప్పుడు వుందా?"

"నాకు తలిదండ్రులు లేరు. పోయినప్పటినుంచీ యిక్కడ కొచ్చేసి వుంటున్నాను.

"కలకత్తాలో అంత ఆస్తి వుంటే మీ రిక్కడ వుండటానికి కారణం?"

"నాకీ మదరాసు నీళ్ళూ క్లయిమేటూ చాలా బాగా పడ్డాయి. అందుకని యిక్కడ కొచ్చి వుంటున్నాను."

"ప్రస్తుతం మీ పేర బ్యాంకిలో ఏమాత్రం డబ్బుంది?"

"లక్షా యేభైవేలుంది—" అని ఆమె చెప్పినదంతా రికార్డు చేసుకొన్న అనంతరం, సబిన్స్పెక్టరు సాగరు నిలా అడిగాడు—

"మీ పేరు?"

"సాగర్!"

"ఇక్కడ యేంపనీ?"

"సాగర్ ఫార్మసీకి ప్రొప్రయిటర్ని."

"మందుల వ్యాపారమా?"

"అవును."

"దొంగను మీరా రెళ్లా పట్టుకున్నారూ?"

"నేను లిల్లీ అన్న యీ స్త్రీతో పార్కులో మాటలాడుతూ వుండగా మొదట దొంగ దొంగ—పట్టుకోండి—అన్న కేకలు విని పించాయి. ఆక్షణంలోనే యీ దొంగ మా ముందునుంచి పారిపోతు న్నాడు. నేను ధైర్యంచేసి పట్టుకొన్నాను. అతని చేతిలో పర్సుంది. తరువాత చాలామంది మూగారు.

"నేరంచేసిన ఆసామీని మీరింతకుముం దెరుగుదురా?"

"ఎరుగను."

"శచిని యెరుగుదురా?"

"వారంరోజులనుంచి రోజూ పార్కులో చూస్తున్నానంతే—"

"అయితే మీరు కూడా రోజూ ఆపార్కుకు వెళుతుంటా రన్నమాట!"

"చిత్తం"

"ఈలిల్లీ అన్న యువతి మీ కేమవుతుంది?"

"స్నేహితురాలు"

"చోరీ' జరుగుతుండడమును మీ యిద్దరలోనూ యెవరయినా కళ్ళతో చూశారా?"

"లేదండి—"

"శచి వేసిన కేకలనుబట్టి అర్థంచేసుకున్నా రన్నమాట!"

"అంతేనండి—"

అనంతరం సబిన్స్పెక్టరు లిల్లీని ప్రశ్నించాడు.

"నీపేరు లిల్లీయా?"

"చిత్తం"

"వృత్తి?"

ఆమె మాటలాడలేదు.

"ఏం పనిచేస్తావ్?"

తిరిగి ఆమె మౌనం.

"ఈమె ఒక బ్రాతెల్ సాబ్!" అని ఒక పోలీసు చెప్పాడు.

"బ్రాతెల్! సిటీరూల్సు ప్రకారం వ్యభిచారం చేస్తూఉన్నందుకు ని న్నెందుకు శిక్షించకూడదూ?"

"లేదండీ. యిప్పుడావృత్తిని మానేసి సినిమాల్లో extra వేషాలను వెడుతున్నాను."

"అయితే చోరీ జరుగుతుండగా నువ్వు చూశావా?"

"లేదండి"

"ఈతడే దొంగ అని ఎలా తెలిసింది?"

"శచి కేకలు వెయ్యడం—పారిపోతువున్న యితనిచేతుల్లో పర్సు వుండడం—ఇందువల్లనే యితడు దొంగ అని నిర్ధారణ చేసి పట్టుకున్నామండి—"

అనంతరం తలదించుకొని వున్న గోపన్‌ను యిన్‌స్పెక్టరు ఇలా ప్రశ్నించాడు.?

"ఏమయ్యా! నీ పేరు?"

"గోపన్!"

"ఏం పని?"

"నిరుద్యోగిని"

"ఈ దొంగపని నువ్వు చేశావా?"

"చిత్తం—చేశానండి"

అని అతడు జంకు లేకుండా నేరమును ఒప్పుకొన్నందుకు అందరూ తెల్లబోయారు. అతడటువంటి సత్యవాదా అని శచి అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది.

"అది నేర మని తెలుసా?"

"తెలుసునండి—"

"తెలిసివుండి కూడా యిటువంటి చోరీ యెందుకు చేశావూ?"

"నాదరిద్రస్థితిగాని, ఆకలిమంటతో మలమల మాడిపోయే నా బిడ్డలయేడుపును గాని వినివుంటే మీ రిలా అడగరండి, నాకు వారం

రోజులనుంచి భోజనం లేదు. నాబిడ్డలు నాలుగు రోజులనుంచి కటికి ఉపవాసాలు చేస్తున్నారు. చిన్నకుర్రాడికి పాలడబ్బాకోసం రెండు రోజులనుంచి ప్రియత్నం చేస్తున్నాను. ఎవరికీ దయ కలుగ లేదు. చూస్తూ చూస్తూ కన్నబిడ్డలను ఆకలి మంటకు ఆహుతి చెయ్యలేక పోయాను. చేసిన ప్రయత్నా లన్నీ విఫల మయిన తరువాత యీ సాహసం చేశాను. నాజీవితంలో యిటువంటిపని చెయ్యడాని కిదే మొదటి సారి!"

అని అతను చెబుతుంటే శచి మనస్సు మరింత కరిగి పోయింది.

"అయ్యో! ఈతనిబిడ్డలవుసురు నాకు తగులుతుంది గాబోలు నే" అని తనలో అనుకొంది.

"అయితే నీకు భార్యాబిడ్డలుకూడా వున్నా రన్నమాట!"

"భార్య లేదు. పిల్లలున్నారు! ఆతల్లి తనపిల్లలను నాకంతానికి చుట్టి రెండు సంవత్సరాల క్రితమే యీ లోకాన్ని విడిచి పెట్టింది."

"మీ యిల్లెక్కడ?"

"చాకలిపేటలో 42 వ నెంబరు గది"

సబిన్ స్పెక్టరు అయిదారు నిమిషాలవరకూ యేమీ మాటలాడక తరువాత—

"నాకీ పోలీసు డిపార్టుమెంటులో పదిహేను సంవత్సరాల సర్వీసుంది. నేను పట్టుకొన్న కేసులలో ఒకరూకూడా యీ విధంగా సత్యమును చెప్పి నేరమును ఒప్పుకొన్నవారు లేరు. అందువల్ల నీకు వీలయినంత తక్కువ శిక్షను వేయించ గలను." అన్నాడు.

"పోనీ యీ బిడ్డల తండ్రిని విడుదలచేసెయ్య కూడదా అండీ. నాసొమ్ము నాకు దక్కిందిగా?" అని శచి అడగ్గా—

"అలా వీలు లేదు. మీరు యిక వెళ్లొచ్చు. మీసొమ్ము విచారణ అనంతరం మీకు చేర్చబడుతుంది." అనిచెప్పి, అనంతర మతను గోపన్ను లాకప్ చెయ్యడాని కాజ్ఞాపించాడు.

"అయ్యో! నాబిడ్డలగతి యేంగాను? వా రాకలి మంటతో ఆపంచ నీపాటికి చచ్చిపోయినారో యేమో—ఒక్కసారి నాబిడ్డలను

చూసుకు రానీయండి. నే నెక్కడికీ పారిపోను. లేదా నాబిడ్డల నిక్కడకు తెప్పించి నాతోపాటే వారిని కూడా లాకప్‌లో వుంచి పుణ్యం కట్టుకోండి—"

అని గోపన్ కళ్ళంట నీళ్ళు కారుస్తూ కంపించి పోయేగొంతుకతో పోలీసు అధికారిని ప్రార్థించాడు.

"లాభం లేదు—అందుకు మాపోలీసురూల్సు ఒప్పవు—"

అని సబిన్‌స్పెక్టరు కటువుగా అని పోలీసులకు సంజ్ఞ చేయగా వా రతనిని తీసుకుపోయి లాకప్‌లో వుంచారు.

శచి ఆదృశ్యాన్ని చూడలేక పోయింది. ఆమెహృదయ మెందుకో మితిలేని బాధ ననుభవించడం మొదలు పెట్టింది.

"మీ రిక వెళ్ళిపోండి అవసరమయితే సమను చేస్తాం"

అని సబిన్‌స్పెక్టరు చెప్పగా శచి సాగర్, లిల్లీ యివతలకొచ్చారు.

"అబ్బ! యీగొడవ మూలంగా నాకు చాలా ఆలస్యమై పోయింది—" అని లిల్లీ చరచర నడిచి పోతూవుంటే—

"లిల్లీ! లిల్లీ!" అని సాగర్ పిలిచాడు. కాని ఆమె మాటలాడకుండానే చక్కా పోయింది. అనంతరం సాగర్ శచితో కలిసి నాలు గడుగులు నడిచాడు.

"నామూలంగా యీవేళ మీ సొమ్ము మీకు దక్కింది—లేకపోతే—"

అని యేమో చెప్పబోతూవుంటే—

"Thank you"—

అని చాలా కటువుగా అంది శచి. తనమీద ఆమె కంత కోప మెందుకో ఆతనికి తెలియ లేదు.

"ఇంటికి వెళ్ళిపోతున్నా గనుకుంటా!"

ఆమె జవాబు చెప్ప లేదు. ఇంతలో చాకలిపేటవైపు పోయే బస్సొకటి రావడంవల్ల శచి అందులో కూర్చుంది. సాగర్ కూడా ఆమెను వెంటాడా లని చూశాడు. కాని బస్సుటిక్కట్టు కయినా జేబులో చేడ డబ్బులు లేవు. ఏం జేస్తాడు?

బస్సు వెళ్ళిపోయిన చాలా సేపటివరకూ బిక్కముఖంతో అక్కడే నిలుచున్నా డేమీ తోచక!

౫

అప్పుడు యెనిమిది గంటలరాత్రి అయివుంటుంది— చాకలి పేట బస్సుస్టాండులో కారు దిగింది. అవి 'బ్లాకవుట్' రోజులుగాబట్టి రోడ్లమీది దీపాలు వెలిగించ బడలేదు. అంతటా చీకటిమయం— శచి యెటుపోవా లన్నా దా రవుపించడం లేదు. క్షణమాత్రి కాలం అక్కడనే నిలుచుంది.

"నా కాపదిహేను వందల రూపాయలూ పోయినా యింత విచార ముండేది గాదు. తండ్రికోసం ఆతల్లిలేనిపిల్ల లెంతగా యేడుస్తు న్నారో పాపం! ఆ వుసురంతా నాది!

అత నెటువంటి సద్ధర్ముడూ గాకపోతే చేసిన నేరము నావిధంగా ఒప్పుకొంటాడా? అతని హృదయనైర్మల్య మంతా ఆకళ్ళల్లోనే వుంది.

ఆతల్లిలేని బిడ్డలకోసం యిక యేదారీ లేక అత నిటువంటి నీచ కార్యమును చేసివుంటాడు. అయ్యో! అత డీ విషయమును ముందు గానే నాతో చెబుతే నేనేమయినా సంతోషంతో యిచ్చేదానినిగదా!

సమయాని కా సాగ రొకడు దాపురించాడు. అందరమూ కలసి చేతులారా ఆగృహస్థును జైలుపాలు జేసి పాపము కట్టుకన్నాము. అతని పైరూపమునుబట్టి మామూలు దొంగ అనుకన్నానుగాని అత నిటువంటి సత్యసంధు డనుకో లేదు.

వారం రోజులనుంచి తిండిలేదుట! ఆకలి మంటతో మలమల మాడేరూపం - అంతకంటే యింకెలా వుంటుంది?

కఠినాత్ము డయిన ఆ సబినిస్పెక్టరు ఒక్కసారి బిడ్డలను చూచు కోవడానికయినా అనుమతించాడు కాడు. ఈ పాపమంతానాది— ఈవుసురంతా నాది. ఏమయితే యెందుకు? జరిగి పోయినది కలిసి రాదు!

నే నిలా ఆలోచిస్తూ యిక్కడ నిలుచుంటే యేమయినట్టు? తల్లి లేని ఆపసి కూనలజాడ నా కెలా తెలుస్తుంది? ఎంత రాత్రయినా సరే

ఈపూట నే నాదిక్కులేని బిడ్డలను చూడాలి—వారి ఆకలిబాధను చల్లార్చి నాపాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అంతవరకూ నా హృదయం చల్లబడదు.

ఆపిల్లలు కంటికి కనుపించే వరకూ నే నింటికే వెళ్ళను—అన్నమే తినను—''

అని ఆమె తనలో తాను దృఢసంకల్పం చేసుకొంది. ఆచీకట్లో తన కగుపించిన మార్గం వయిపు నడిచింది. చాకలిపేట వీధులన్నీ తిరగడం ప్రారంభించింది. పిల్లల సందడి యెక్కడ వినిపించినా నలభై రెండో నెంబరు యిల్లదేమోనని తొంగిచూసింది. కాకపోవడం వల్ల నిస్పృహ చెంది తిరిగి ముందుకు సాగిపోయింది.

ఆరాత్రి తొమ్మిదిగంటలు కూడా దాటిపోయింది. ఎన్నడూ ఒక ఫర్లాంగు దూరమయినా నడిచి యెరుగని, సుకుమారి ఆచీకట్లో చాకలిపేట అంతా గాలించింది.

నలభై రెండో నెంబరు యిల్లూ కనుపించడంలేదు—ఆపిల్లలూ కనుపించలేదు. ఒకవేళ అతను అబద్ధమును చెప్పాడేమోనని ఒకసారి అనుకుందికాని, తిరిగి నమ్మలేక పోయింది.

తిరిగినకొద్దీ, ఆమెకు పట్టుదల యెక్కువవుతూవుంది.

పదిగంటల రాత్రివేళ ఒక యిరుకుసందులో ప్రవేశించింది. అంతటా గాఢాంధకార మయం. జనసంచార మసలేలేదు. అప్పుడప్పుడు కుక్కలుమాత్రం భయంకరంగా అరుస్తున్నాయి.

శచి మొండిధైర్యంతో ఆయిరుకు సందంట, చీకట్లో, వడివడిగా నడచిపోతూవుంటే ఆవీధికి చివర ఒక అరుగుమీద పిల్లల యేడుపు వినిపించింది. ఆమె మరింత వడిగా ఆదెసకు పోయింది.

"నాన్నా! నాన్నా!—''

అని ఒకపెద్ద గొంతుక—ఆ గొంతుకతో శ్రుతికలిపి, వెక్కి-వెక్కి యేడుస్తున్న మరో చిన్ని గొంతుక—ఆమెకు వినిపించింది. నిర్మానుష్యంగా వున్న ఆవీధిలోని ఒక యింటి అరుగుమీద కూర్చుని గుండెలు బ్రద్దలైపోయేటట్లు ఏడుస్తున్న, ఆపిల్లలే గోపన్ బిడ్డలయివుంటా

రని ఆమె ఊహించుకొని, రెండడుగులలో వాళ్ళ చేరి, ఇద్దరపిల్లలనూ చెరో చంకనూ యెత్తుకుంది.

ఆరేడు సంవత్సరాలదొకపిల్ల, రెండు సంవత్సరాలవా డొక పిల్లాడు.

ఆమె చంకనెక్కిన చిట్టిబాబు—

“అమ్మా—అమ్మా!” అని మరింత బిగ్గరగా యేడవడం మొదలు పెట్టాడు. అమ్మడికేమీ అర్థంకా లేదు. తమ్ము నెత్తుకొన్న ఆ దయామయు రాలెవరా అని ఆలోచించడంలో ఏడుపు మాయమయింది.

మీ నాన్నగారి పేరు చెప్పగలవా తల్లీ! ఇలా యేడుస్తున్నా రెందుకూ?” అని శచి బుజ్జగించి అడగ్గా—

“మానాన్నగారి పేరు గోపన్. చిట్టిబాబుకు పాలడబ్బా—నాకు డబ్బులూ తెస్తానని వెళ్ళారు—చాలా సేపయింది. మానాన్నగారింకా రా లేదు—చీకట్లో మాకు భయము—ఆకలి---”

అని అమ్మడు గుక్క తిప్పుకోకుండా, మూడుముక్కలలో తమ విషయము నామెకు చెప్పింది;

శచికి సందేహం తీరిపోయింది. వారే జైలు పాలయిన గోపన్ బిడ్డలని తెలిసినప్పు డామె కళ్లు చెమ్మగిల్లాయి. ఇద్దర పిల్లలను హృదయానికి అదుముకొని “భయంలేదు తల్లీ! మీకు నే నున్నాను. మీయింట్లో యేముందీ?” అని శచి అడగ్గా—

“రెండు మూడు కుండలు, ఒకచింకి చాపా తప్ప యింకేమీ లేవు.” అమ్మడు చెప్పినందువల్ల ఆయింటికి తాళంవెయ్యడం కూడా అనవసరమని తెలుసుకొన్న శచి ఆయిద్దర బిడ్డలనూ గుండెలకు అదిమి పట్టుకొని, అక్కడనుంచి నిష్క్రమించినది.

గట్టిగా గాలివీస్తే బట్టలు నలిగి పోతాయనే నాగరికురాలు, కూర్చుంటే సిల్కుగౌనుకు మట్టి అంటుతుందని భయపడే షోకేలా, అప్పు డెటువంటి అరమరికా లేకుండా ఆదిక్కులేని బిడ్డల నెత్తుకొని పెద్ద రోడ్డుమీది కొచ్చింది.

అప్పటికి పదిగంటలు దాటిపోవడంవల్ల, బస్సులు లేవు. అందు

వల్ల ఆమె ఒక హోటలులోనుంచి ఫోనుచేసి టాక్సీ కారును తెప్పించి ఆపిల్ల లిద్దరితోనూ అందులో కూర్చుని, తన బంగళా చేరుకుంది.

అమ్మగారి రాకకోసం వేచివున్న పరిచారికలు అప్పు డెవరో యిద్దర బిడ్డల నెత్తుకొని వచ్చిన శచిని చూసి ఆశ్చర్యపోయారు.

"ఈవేళ యింతఆలస్యమయిం దేమండమ్మా! ఈ పిల్లలెవరూ?"

"వేడినీ ళ్లింకా మరుగుతున్నాయండి. స్నానానికి నీళ్లు పెట్ట మన్నారా?" అని ఒక పరిచారిక—

భోజనం సిద్ధంగా వుందండమ్మా!" అని మరియొక పరిచారకు రాలు, చెప్పగా...

"ముందుగా యీపిల్లలిద్దరకూ, సబ్బురుద్ది, వేడినీళ్లు పోయండి. తరువాత చెబుతా!" అని శచి తనచంకలోని బిడ్డల నిద్దరనూ, పరి చారికలకీయగా, వా రామె చెప్పినట్లుగా చేయడానికి వెళ్ళారు.

అది ఏమి ఋణమో! ఏమి బాంధవ్యమో! ఒకపంచను దిక్కు లేక ఆకలి పేగులతో. ఎలుగెత్తి ఏడుస్తుండే పసిపాప లా అంతః పురంలో పడ్డారు. జమిందారిణి అయిన శచి వారికి సంరక్షణచేయ కంకణం కట్టుకుంది.

పరిచారికలు మరికొంత సేపటికి ఆబిడ్డల నిద్దరనూ స్నానాలు చేయించి తీసుకొచ్చారు. శచి తనంతట తాను చిట్టిబాబుకు వెన్న బిస్కత్తులు, పెట్టగా వాడు నిమిషంలో కడుపు నింపుకున్నాడు. అనం తరం పండ్లరసము---ఆపుపాలు మొదలయిన వాటిని తాగించి తన పందిరి మంచంమీద ఆబిడ్డను నిద్దరపుచ్చింది.

అమ్మడికి మంచి మంచి కూరలతోనూ గడ్డపెరుగుతోనూ దగ్గర కూర్చుని, కడుపునిండా భోజనం పెడుతూవుంది. అంతవరకూ ఆకలిమంటతో ఆవురావురు మంటూవున్న అమ్మడు కిక్కురుమన కుండా, ఆమె పెట్టినదానినంతా తింది. నోరెరుగని పసి కూనల కంతకం టేమి తెలుస్తుంది.?

కడుపు నిండితే కైలాస మన్నట్లు, అమ్మడు అప్పుడు తండ్రిని గురించి ప్రశ్నించడం మొదలుపెట్టింది.. పుట్టిన తరువాత ఆమె అటు

వంటి దివ్య భవనమును---విద్యుద్దీపాలనూ ఎన్నడూ చూచియెరుగదు. అందువల్ల కొంచెం ఖంగారు పడింది.

"మీనాన్న యెక్కడున్నారు?"

"మానాయన రేపు వస్తాడు తల్లీ!"

"ఎక్కడకు వెళ్ళాడు?"

"పని మీదవెళ్ళాడు—మిమ్మల్ని నాకు వప్పజెప్పాడు."

"ఏం పనిమీద వెళ్లాడు?" అని అమ్మడు అడుగుతూ వుంటే సమాధానాలు చెప్పలేని శచికి గుండెల్లో రాయిపడింది. కడుపు నిండింది గాబట్టి చిట్టిబాబు పందిరి మంచంపై పరుపుమీద నిదిగా పడుకొన్నాడు. వాడికి కావలసిందంతే!

కాని అమ్మడు కొంచెం జ్ఞాన మొచ్చినపిల్ల. ఆమె కేమని సమాధానం చెప్పాలో శచికి తెలియడం లేదు. కాని ఆపిల్లలిద్దరనూ చూస్తుంటే ఆమెకు గుండె చెరువై పోతూంది. ఆ పసికూనలు రెండూ రెండు మాణిక్యాలు. ముఖంలోని ఆ తేజస్సు—కళ్ళలోని వెలుగునూ చూసి శచిఎంతయినా మురిసి పోతూంది.

"ఏరాణివాసంలోనో పుట్టవలసిన ఈ బిడ్డలు ఆదరిద్రగృహస్థు కెలా కలిగారు చెప్మా?" అని తనలో తానాశ్చర్య పోయింది. తండ్రిని గురించి అడుగుతున్న శచిని మరిపించాలని ఆమె వుద్దేశ్యం.

"నీపే రేమిటి తల్లీ?"

"అమ్మడు."

"మీ తమ్ముని పేరో?"

"చిట్టిబాబు."

"మరి నువ్వు కడుపునిండా బువ్వతిన్నావా? ఆకలి పోయిందా?"

"నేను పుట్టాక, యింత కడుపునిండా యెప్పుడూ తిన లేదు—"

"అయ్యో వెర్రితల్లీ!" అని శచి, అమ్మడిని దగ్గరగా తీసుకొని కౌగలించి, ఒడిలో కూర్చొబెట్టుకొని ముద్దాడి—

"రేపు నిన్ను బజారుకు తీసుకెళ్ళి పట్టుపరికిణీలు—సిల్కు గౌనులూ అన్నీ కుట్టిస్తా. ఏం?" అంది.

"మరి మా తమ్ముడికో—"

"మీ తమ్ముడికీనమ్మా!"

"ఆ కొత్తబట్టలన్నీ కట్టుకొని, మా నాన్నగారున్న దగ్గర కెడదామా?"

"అవునమ్మా—అవును."

"మానాన్నగా రెక్కడున్నారు?"

శచి మాటలాడలేదు. ఆ పిల్లలా అడుగుతూవున్నకొద్దీ, శచి హృదయం ద్రవించి పోతూన్నది.

'చిట్టిబాబుకు పాలడబ్బ కోసమని వూరంతా తిరిగారు. ఎక్కడా దొరికిందికాదు. వా డాకలితో గుక్కపట్టి యేడుస్తుంటే నేనుకూడా వూరుకోబెట్టలేక పోయాను. ఈసారి తప్పకుండా చిట్టిబాబుకు పాలడబ్బా, నాకు డబ్బులూ తెస్తానని వెళ్ళారు. తిరిగి రాలేదు. ఏం చేత?"

"నన్ను మీయింటికి పంపి, మీనాన్నగారు మళ్ళీ వెళ్ళారమ్మా!"

"పాలడబ్బా డబ్బులూ దొరికాయా?"

"ఆ! కావలసినవన్నీ, ఈ యింటినిండా పెట్టి వెళ్ళారు."

"ఈ యిల్లెవరిదీ?"

"మీదే."

"ఎక్కడిదీ?"

"వొచ్చింది"

"మరి నువ్వెవరవు? మా అమ్మవా?"

శచి తలను కిందికి దించుకొని, ఒకటి రెండశ్రుబిందువులను కింద రాల్చింది.

"నీ కింకా నిద్దర రావడంలేదా అమ్మడూ?"

"వస్తూంది—నాకూ నిద్దరొస్తూంది."

"మరయితే మీతమ్ముడి పక్కలో పడుకుంటావా? జోలపాడి నిద్దర పుచ్చుతాను?"

"పరుపు మాసిపోయిందా?"

"పరవాలేదు తల్లీ—ఆ పరుపులు--మాచాయా--అన్నీ మీవే."

అని చెప్పి శచి, అమ్మడిని ఎత్తుకొని తీసుకెళ్లి—చిట్టిబాబు పడుకొనివున్న పందిరి మంచంమీద పడుకోబెట్టి, గాలికోసం, టేబిల్ ఫేనును దగ్గరగా పెట్టింది.

జోలపాట సగసగం లేకుండానే, అమ్మడు నిద్రాదేవి ఒడిలో కన్నులు మూసింది. శచి అప్పుడు తన స్నానమూ వగైరాలు ముగించుకొని, భోజనం చెయ్యడానికి వెళ్లింది.

౬

అదే రాత్రి—

ఆమె భోజనం వగైరాలను పూర్తిచేసేటప్పటికి, పన్నెండు కూడా దాటింది. అప్పుడామె, చిట్టిబాబు, అమ్మడు పడుకొన్న మంచానికే చేరువగా మరొకమంచమును వేయించుకొని పడుకొంది.

కాని—ఎంతప్రయత్నం చేసినా ఆమెకు నిద్దర పట్టలేదు. పట్టపగలుగా వున్న ఆగదిలోని విద్యుద్దీపాల వెలుతురులో ఆమె పడుకొని నిద్దరపోతూవున్న పసిబిడ్డల అమాయికపు ముఖాల్లోకి తదేకధ్యానంతో చూస్తూవుంది.

"తల్లి లేకపోయినందుకూ వున్నతండ్రి నామూలంగా జైలుపాలయిపోయినందుకూ, ఈరాత్రి గనక నే నీబిడ్డల్నిక్కడకు తీసుకురాక పోయినట్లయితే, ఏ రేమయిపోయేవారో గదా!

ఎంత ఆకలిలో వున్నారో పాపం! ఎంతపెట్టినా వద్దనలేదు.

ఇటువంటి దిక్కులేని ప్రాణాలీ ప్రపంచంలో ఎన్ని వేలున్నాయో, యెవరికి తెలుసు? తనబిడ్డల స్థితిని గురించి ఆ జైలులో వున్న గోపన్ యీరాత్రి యెంతగా దుఃఖపడుతున్నాడో! వారు నాదగ్గర సురక్షితంగా వున్నారన్న విషయం తెలిసేవరకూ, అతని ప్రాణం కొట్టుకొని పోతూనేవుంటుంది. తన్నావిధంగా జైలుపాలు చేసిన నేను, తనబిడ్డల నీవిధంగా సంరక్షిస్తానని అతనెలా అనుకుంటాడు?

ఈ రెక్కలురాని బిడ్డల ఆకలిమంటను చల్లార్చడానికే గదా, ఆత డీవిధంగా, నీచమయిన దొంగతనం చెయ్యడానికి కూడా సాహసించాడు! ఇంతచేసిన ఆతండ్రి తనబిడ్డలకోసం ప్రాణాన్నయినా త్యాగం చెయ్యగలడు.

ఇదే ప్రకృతిలోని విశేషం! కన్న మమకారమును!

ఈమాత్రం తెలుసుకోలేని ప్రజలు, అతన్ని, దొంగ అంటారు. చోరవృత్తివల్ల జీవించే నీచుడంటారు. తనబిడ్డకొక్క పాలడబ్బాగాని, చారెడు నూకలు గాని దొరికినట్లయితే అతనిటువంటి నీచకార్యానికి సాహసించడుగదా!

అత డెన్ని ప్రయత్నాలుచేసి, విఫలుడై నిరాశ చెందడంవల్ల ఈనీచకార్యానికి దిగాడో ఎవరికీ తెలియదు. తెలియనివాళ్లు దీనిని దారుణమని గర్హిస్తారు. చట్టప్రకారం శిక్షిస్తారు.

ఇంతచేసిన యీప్రజలూ—ఈలోకమూ అతని రెక్కలురాని బిడ్డలను పోషించగల మార్గమును చూపరామా?

అని యిలాగే ఆరాత్రి యింకా యేమేమో ఆలోచించుకొంటూ వుంటూవుండగా, ఆమె కోరాత్రివేళ కనుకు పట్టింది—అప్రయత్నంగా ఆమె కనురెప్పలు బరువెక్కి మూతలు పడ్డాయి. అదేరూపం! అదేమాసిన గడ్డం—అవే చింకిగుడ్డలు. పోలీసుల యెదుట సహితం, ప్రశాంతంగా, తేజోవంతంగా, నిర్మలంగా వుండే అతని కళ్లిప్పుడెందుకో చాలా భయంకరంగా వున్నాయి. శచి భయంతో వణికి పోయింది.

"నేను దొంగనుగాను—ఆవృత్తివల్ల జీవించే నీచుడను కాను. తల్లిలేని బిడ్డలు—వారి ఆకలి పేగులు—ఏడుపు ధ్వనులు—నువ్వు విన్నావా? నీకు తెలుసా?

తెలుస్తే నన్నీవిధంగా జైలుపాలెందుకు చేస్తావు? ఆ రెక్కలురాని పక్షుల కిప్పు డెవరు దిక్కు? ఈపాప మంతా యెవరిది! ఈవుసురంతా యెవరిది? చెప్పు—చెప్పు. మాటలాడవేం.

అంటూ గోపన్ రౌద్రమూర్తిఅయి ఆమెకంఠంమీద

కూర్చుని, శీక నులిపెయ్య బోతూవుంటే—

"గోపన్! గోపన్! అయ్యో! నన్ను చంపెయ్యకు—నీబిడ్డల ఆకలిపేగులూ చూశాను—వారి ఏడుపు ధ్వనులు విన్నాను. కనుక నే చూడు! ఆమంచంమీద చూడు! ఎవరున్నారు? నీబిడ్డలు కారూ!"

అని శచి వొణుకుతున్న గొంతుకతో అనగా, గోపన్ ఆదుర్దాతో ఆమె చూపెన దెసకు చూశాడు. ఆమంచంమీద—మృదు పాన్పుపై సుఖనిద్దర చెందుతూ వున్నవారు తనబిడ్డలే అని గుర్తించు కొన్నాడు.

అతని ముఖం తిరిగి ప్రశాంతమయింది. అతనికళ్లల్లో తిరిగి ఆ దివ్యతేజస్సు వెలిగింది.

"నువ్విటువంటి దయాసంపన్నురాల వని తెలియక తూల నాడాను. క్షమించు నాబిడ్డల కాశ్రియమిచ్చి కాపాడావు. నాకదే పదివేలు! నే నిక యేమైపోయినా విచారం లేదు. నీవుపకారాన్ని మరచి పోను—" అని అతడు రెండుచేతులూ యెత్తి, ఆమెకు నమస్కారం చెయ్యబోతూవుంటే, శచి ఆచేతులను పట్టుకొంది—

"నాకు కలిగిన సర్వస్వము నీబిడ్డలది—నాకు చేతనయిన సేవ లన్నీ, నీబిడ్డలకోరకే!ఇది నాలోకలిగిన దృఢసంకల్పం—నాబిడ్డలొకటి నీబిడ్డ లొకటిగాదు. గోపన్! ఇక నీబిడ్డలకై నువ్వు విచారించకు. ఇంతే గాకుండా నీకు శిక్షలేకుండా చేయడానికే ప్రయత్నంచేస్తా......"అని శచి యింకా యేమో చెబుతూనేవుంది. ఇంతలో ఒకపరిచారకురా లొచ్చి—

"అమ్మా! మీకోస మెవరో వచ్చి చాలసేపటినుంచి వేచి వున్నారు" అని చెప్పటంవల్ల శచికి నిద్రాభంగం కలిగింది. ఆమె ఖంగారుతో లేచి కూర్చుని, నాలుగువైపులా కలయజూచింది. పందిరి పాన్పుమీద పిల్లలు యథా ప్రకారంగా నిద్దర పోతున్నారు. ఎదురుగా పరిచారెక నిలుచుంది. దానిని బట్టి తా నింతవరకూ కనిన దొక స్వప్నమేనని గ్రహించుకొని ఒక నిట్టూర్పు విడిచింది.

"ఏమంటున్నావు!నాకోసమెవరొచ్చారు?.అని పరిచారికనడగ్గా,,

"ఎవరో నమ్మా. చాలసేపయింది. మీకోస మొచ్చికూర్చున్నారు. అని ఆమె జవాబుచెప్పింది. శచి వెంటనే యివతలకొచ్చి చూచేటప్పటికి సాగర్ సిగరెట్టు కాల్చుకొంటూ ఒక కుర్చీలో కూర్చుని వున్నాడు. ఆతుంటరి తిరిగి తనయింటికి కంత పొద్దున్నే యెందుకొచ్చాడా అని ఆమె ఆశ్చర్యపోయింది.

"నాతో మీకేం పనుంది? అని ఆమె అతనిని తీవ్రంగా అడిగింది.

అతడు సవినయంగా లేచి నిలుచుని, "పని వుండే వచ్చానండి. మీ కేదయినా తొందరపని వుంటే చూసుకోండి. మీ కేదయినా తొందరపని వుంటే చూసుకోండి! యిక్కడనే వేచి వుంటా! ఇదివరకు చాలా సార్లు వచ్చా కాని మీ దర్శనం కాలేదు" అని అతివినయంగా జవాబు చెప్పాడు.

"చెప్పండి - యేమిటీ మీకు నాతో గల వ్యవహారం——?" అని శచి తీవ్రంగా అడిగింది.

"మీ సొమ్మును అపహరించిన దొంగకు కనీసం ఆరు సంవత్సరాలయినా శిక్ష పడుతుంది. మీ సొమ్ము దమ్మిడీ తక్కువ గాకుండా తిరిగి మీ కొచ్చేస్తుంది. అందుకు మీరు నాకు కృతజ్ఞులే ననుకుంటా! నేను దొంగను పట్టుకోక పోయినట్లయితే, మీ పదిహేను వందలూ గంగా ప్రవేశమేగదా!" అని అతడు చెబుతూవుంటే—

"గోపణ్ణను నేను జైలుపాలు చేయడంకంటే నా సొమ్ము గంగా ప్రవేశ మయినప్పటికీ నాకు సంతోషంగానే వుండేది." అని శచి చెప్పడము నాలకించిన సాగర్ తెల్లబోయాడు.

"ఇలా అంటున్నారేం! మీ సొమ్మును అపహరించిన వాడు శిక్షను పొందడం మీ కిష్టంలేదా."

"లేదు."

"మీ రతన్ని ప్రేమించారు గాబోలు."

"అవును." అని ఆమె ఆలోచించకుండా అనేసింది. దానితో అతడు మరింత నిశ్చేష్టు డయ్యాడు.

"మీరు గోపన్‌కు శిక్షపడకుండా వుండే యేర్పాటు చెయ్య గలరా! అలా చేస్తే నాకు చాలా సంతోషం!"

"అది అసంభవం! దొంగనుపట్టుకొన్నందుకు నాకు రివార్డు వస్తుంది."

"అతనికి శిక్ష పడకుండా వుంటే, ఆరివార్డుకు పదిరెట్లు బహుమానం నే నిస్తా."

"ఏమిస్తారు?"

"వెయ్యిరూపాయలు."

"సొమ్ము చాలదు."

"మ రేమిటి?"

"చిరకాలంనుంచి మీపై నా మనస్సు లగ్నమై వుంది. అనుదినమూ పార్కులో మీరూపాన్ని చూచి ముగ్ధుణ్ణయి పోయేవాణ్ణి. ఆ దొంగను, ఆ బికారిని ప్రేమించడం చాలా తెలివితక్కువ. నన్ను ప్రేమించి ధన్యుణ్ణి చెయ్యండి..."

"నోరుముయ్యి. అవసరం పేలాపన పేలావంటే—" అని ఆమె కూర్చున్న చోటులోనుంచి లేచేటప్పటి కతను ఖంగారు పడ్డాడు.

"ఇంకా, అవతలకు నడవేం? తుంటరీ!" అని ఆమె తిరిగి గద్దించేటప్పటికి, సాగర్ ముఖం వెలవెల బోయింది. అతడు కిక్కురు మనకుండా గుమ్మం దాటాడు. శచి తక్షణం వీధితలుపులను బిగించి లోపలకు పోయింది.

పిల్ల లింకా లేచారో లేదో చూదామని, శచి, వా రున్న గది లోకి వెళ్ళే టప్పటికి, అమ్మడు లేచి మంచంమీద కూర్చుంది.

"నాన్న! నాన్న రాలేదూ?" అని శచిని అడుగుతూవుంది.

"వస్తారు తల్లీ. ఇప్పుడు మనం బజారు వెళ్ళి కొత్త బట్టలు, బొమ్మలూ, అన్నీ కొనుక్కుందాము. దా!"

అని శచి అమ్మడిని చంక నేసుకుంది. బొమ్మలమాట చెవుల్లో పడేటప్పటికి చిట్టిబాబుకూడా లేచి కూర్చున్నాడు. శచి అతన్నికూడా మరో చంక నేసుకొని, ముఖం కడిగి, కాఫీ వగైరా లీయడానికి యివతలకు తీసుకొచ్చింది.

## ౨

గోపన్‌ను కలుసుకోవడానికని, శచి పిల్లలతో ఆ మర్నాడే అతను బంధింపబడివున్న తావుకు వచ్చింది. కాని అధికారులు అందుకు అనుమతి నియ్యలేదు. ఆమె నిరాశతో పిల్లలను వెంట బెట్టుకొని తిరిగి యింటికొచ్చి చేరుకొంది.

అమ్మడికీ, చిట్టిబాబుకూ ఆమె యెన్నెన్నో విలుగవల దుస్తులను కట్టించింది. బొమ్మలు కొంది. బంగారపు వస్తువులు చేయించింది. ఆ యిద్దరు పిల్లలూ ఆమె దగ్గర రాజకుమారుల కంటే యెక్కువ ఘనంగా పెరుగుతున్నారు.

శచి యొక్క ఆదరణలో, పోషణలో, ఆమెయొక్క లాలింపులలో చిట్టిబాబు యీ ప్రపంచమునే మరచిపోయి ఆడుకొంటున్నాడు. అమ్మడుమాత్రం మధ్యమధ్య తండ్రిమాట తలపెట్టకుండా వుండడం లేదు. శచి ఆమెకు యుక్తిగా సమాధానం చెప్పి మరిపిస్తూంది.

ప్రయత్నంచేస్తే గోపన్‌కు శిక్షలేకుండా పోతుందేమోనని శచి సమర్థుడయిన ఒక లాయరును ఏర్పాటు చేసింది. కాని నేరస్తుడు తనంతట తానే నేరమును ఒప్పుకుంటున్నాడుగాబట్టి వాదించి ప్రయోజన ముండదని విషయము నంతటినీ తెలుసుకున్న అనంతరం లాయరు చెప్పాడు. నేరస్తుడు సత్యమును చెబుతున్నాడు గాబట్టిన్నీ, ఇదే మొదటి నేరము గాబట్టిన్నీ, ఎక్కువశిక్ష లేకుండా వాదించడానికవకాశ ముందంతేగాని, అసలుశిక్ష పడకుండాచేయడం అసంభవమని చెప్పాడు. కనీసం అందుకయినా ప్రయత్నం చేయవలసిందని శచి కోరింది.

అయితే—కొనకా ప్రయత్నంకూడా అవసరం లేకుండా పోయింది. పోలీసు స్టేషనులో నుంచి రికార్డు న్యాయస్థానానికి పంపబడింది. ముద్దాయి విచారించబడ్డాడు. అతడు పోలీసు స్టేషనులో చెప్పినట్లుగానే యథార్థమును చెప్పేసి నేరమును ఒప్పేసుకోవడంవల్ల యితర సాక్షులతో గాని, Further విచారణతోగాని నిమిత్తం లేకుండా న్యాయాధికారి అతనికి నాలుగు మాసాలు శిక్షలు మాత్రం విధించి దయతల్చాడు.

ఇంకా యెప్పుడో విచారణ జరుగుతుందనీ, తనకు సమను పంప బడుతుందనీ తలచి ఎదురు తెన్నులు చూస్తూవుండగా ఒక నాడామెచే నిర్ణయించబడిన లాయరు స్వయంగా ఆమె యింటికొచ్చి "మీ పర్సు నపహరించిన నేరస్థుడు గోపన్‌కు నాలుగు మాసాలు శిక్ష పడిందండీ" అని పిడుగువంటి మాట చెప్పేటప్పటి కామె నిర్ఘాంతపోయి-

"ఇదంతా యెప్పుడు జరిగింది? విచారణ సమయానికి మేము దగ్గర వుండనవసరం లేదా?" అని ఆమె ఉద్విగ్నతతో అడిగింది.

"అవసరం లేదు—యిది పోలీసు కేసుగదా, మీ రుండ నవసరం లేదు. అంతేగాకుండా నేరస్థుడే యథార్థమును ఒప్పుకొంటూవున్నప్పుడిక విచారణ దేనికి? అధికారులుకూడా చాలా జాలి దలిచారు. అందువల్లనే అంత తక్కువశిక్ష."

"గోపన్ యిప్పుడెక్కడ వున్నాడు?"

"చిన్న జైలులోనుంచి పెద్ద జైలులోకి గొనిపోబడి వుంటాడు."

"నేనతన్ని జరుగురుగా కలుసుకోవాలంటే యేమిచెయ్యాలి?"

"జైలుఅధికారులకు దరఖాస్తును పెట్టుకొంటే, వారు అందు కనుమతించి ఆర్డరు వేస్తారు."

"అయితే మీరు వెంటనే ఆవిధంగా ఒక దరఖాస్తును యీ వేళ పడేయించండి. అతను తనబిడ్డలగతి యేమయిందో అని దుఃఖ పడుతూవుంటాడు. వారు నాదగ్గర సురక్షితంగా వున్న విషయ మయినా అతనికి తెలుపుడు చెయ్యలేక పోయానే!"

"దరఖాస్తులో యీవిషయమును కూడా ఉదాహరిస్తాను. అప్పుడు మీ రాతని బిడ్డలను కూడా, వెంటబెట్టుకొనిపోయి చూప వచ్చును. తిరిగి రేపు మీకు ఆర్డరు రావచ్చును."

"మంచిది—అలా చేయించండి. అయితే ప్లీడరుగారూ! ఆ ఖయిదీకి మన మేమయినా పట్టు కెళ్లి ఈయడానికి వీ లుంటుందా?"

"ఏమిస్తారు?"

"ఏమయినా కొన్ని బట్టలుగాని, తినుబండారాలుగాని—"

"వీలుండదు—అతడు క్రిమినల్."

శచి ఒకనిట్టూర్పు విడిచి వూరుకొంది.

"ఆ ఖయిదీ విషయంలో మీా కింత దయ యెందుకో అడుగ వచ్చునా?"

"చెప్పలేనండి ఆ గృహస్థుకు నేను నిష్కారణంగా తీరని అపకారమునే చేశాను!"

"అతడు చోరీ చేసిన నేరస్థుడుగదా!"

"మీాకు తెలియదు—" అని శచి వెంటనే లోపలకు వెళ్లి, గోపన్ బిడ్డల నిద్దరనూ యువతలకు తీసుకొచ్చి లాయరుకు చూపింది. వారే చక్రవర్తి బిడ్డలలాగునో వున్నారుగాని, ఖయిదీ బిడ్డలలాగున లేరు. ఒంటినిండా బంగారు ఆభరణాలు -విలువగల దుస్తులు. చంద్రబింబంవంటి ముఖాలు. వారు గోపన్‌బిడ్డలంటే లాయరు నమ్మలేకపోయాడు.

"మీారు నాతో హాస్య మాడుతున్నారు! వీరా ఖయిదీ బిడ్డలెలా అవుతారు!

"భగవంతుడి సాక్షి వకీలుగారూ! ఈయిద్దరూ గోపన్ పిల్లలే!"

"ఈ విలువగల దుస్తు లేమిటి? బంగారు ఆభరణా లేమిటి ?"

"ఓ! ఇవన్నీ నాదగ్గర కొచ్చాక యేర్పడ్డ వనుకొండి."

"అలా చెప్పండి."

"ఇంతటినుంచీ వీరు నాపిల్లలే అను కొండి —"

"అదెలాగు ?"

ఆమె మాటలాడ లేదు.

"మీారు కోప్పడకుండావుంటే ఒకమాటనా లనివుంది"

"అభ్యంతరం లేదు."

"మీారా గోపన్‌ను ప్రేమించారా" అని లాయ రడగ్గా శచి ఓ చిరునవ్వును నవ్వి —

"అవునంటే మీారు చాలా ఆశ్చర్య పడతా రనుకుంటా"

"కాదామరి? మీాలాంటి సౌందర్య నాగరికతలు కలిగినవిద్యావతి — శ్రీమంతురాలు ఆగోపన్‌వంటి ఒక బికారిని, ఖయిదీని,

ప్రేమించిందంటే, నేనేగాదు — ఎవ రయినా ఆశ్చర్యపడతారు."

"మీరు గోపన్ విషయంలో పొరబడు తున్నారు. అతని పవిత్ర హృదయం నా ఒక్కదానికే తెలుసు. తినడానికి తిండిలేని బికారే కానియ్యండి— ఖయిదీయేగానీయండి — అతడు పూజ్యుడు. సత్యమును వెలిబుచ్చడానికి జంకనిధీరుడు." అని శచి చెప్పగా లాయరు క్షణకాలం మౌనమును వహించి, అనంతరం —

"ఏమోనమ్మా! ఇది నేను ఊహించుకోలేని విషయం" అన్నాడు.

అందుకు శచి తిరిగి యేమీ చెప్పలేదు.

"మీ పదిహేను వందలరూపాయల సొమ్మా కోర్టులోవుంది. దానిని తీసుకోవలసిందని కోర్టువారు మీకు రేపో నేడో తెలుపుడు చేస్తారు. మీరు వెళ్ళి తెచ్చుకో వచ్చును. ఇక నాకు సెల విప్పించండి. వెడుతున్నాను." అని చెప్పి లాయరు అక్కడనుంచి వెళ్ళి పోతూ వుండగా—

"జైలు అధికారులకు యీ నేళనే దరఖాస్తు పెడతారుకామా" అని తిరిగి అడిగింది.

"ఆహా! తప్పక పెడతాను. ఆర్డరు రావడంతోనే మీదగ్గర కొచ్చి చెబుతాను. అప్పుడు మీరు పిల్లలతో వెళ్లవచ్చును." అని చెప్పి లాయరు వెళ్ళి పోయాడు. వారి సంభాషణబట్టి అంతవరకూ అక్కడే వున్న అమ్మడు కొంత అర్థం చేసుకుంది.

"మా నాన్నగారు జైల్లో వున్నారా?" అని ఆశ్చర్యంతో అడిగింది.

లేదమ్మా! మానాన్నగారు జైల్లో యెందు కుంటారు? "

"మరి మనం జైలుకు వెడతామని చెబుతున్నావుగా. మా నాన్నగార్ని కలుసుకో డానికే "

"అబ్బే! కాదు తల్లీ! జైలుకు దగ్గరగానే యింకోమంచి యిల్లుంది-అందులో వున్నారు మీనాన్నగారు. రేపు మనం అక్కడికే వెడతాము.

"మా నాన్నగారు కనుపిస్తారా?"

"ఆ! కనుపిస్తారు."

"ఇక్కడకు రాకుండా అక్కడెందుకున్నారు?" వేరే పని వుంది - అందువల్ల వున్నారు. అమ్మడు యింకేమీ అడుగలేదు.

"అమ్మడూ! నేను నీకేమవుతానో చెప్పగలవూ?"

అమ్మడు ఆలోచించింది.

"ఏమవుతావు."

"నువ్వు చెప్పు."

"అమ్మనవుతావు" అని ఆపిల్ల అప్రియత్నంగా అనేటప్పటికి, శచికి అపరిమితమయిన ఆనందం కలిగింది. ఆమెను దగ్గరగా తీసుకొని ముద్దాడి —

"అయితే నువ్వెప్పుడూ నన్నలాగే **పిలుస్తావా** తల్లీ!"

"ఊఁ! అలాగే పిలుస్తాను."

"ఏమని పిలుస్తావు?"

"అమ్మా! అని పిలుస్తా."

శచి అమ్మడి నునుచెక్కలమీద అప్పుడెన్ని వేల ముద్దులు పెట్టుకుందో తెలియదు. శచి అప్పగారిని ముద్దులు పెట్టుకుంటూవుంటే ఆ చేరువలోనే వున్న చిట్టిబాబు అసూయపడ్డాడు. శచిమీద తనకు తప్ప యింకెవరికీ అధికారం లేనట్లు, అప్పగారిని చేతులతో నెట్టేసి తాను శచిమీదికి పాకిపోతూవుంటే, ఆమె నవ్వుకొని ఆబిడ్డను కూడా ఒడిలో కూర్చోబెట్టుకొని ముద్దులాడడం మొదలు పెట్టింది.

అంతవరకూ ఏ విషయంలోనూ సంతోషమును కలిగించుకో లేని శచికా బిడ్డలు వచ్చినప్పటినుంచి ఏదో స్వర్గాధిపత్యమబ్బినట్లుగా వుంది - ఆమె ఆనందానికి మేర లేకుండావుంది.

౮

"నాకీ జైలుశిక్ష గాకుండా, మరణశిక్ష విధించబడినట్లయితే, రెక్కలు రాని ఆ పిల్లల కోసమీ విధంగా, హృదయం తరుక్కు పోయేటట్లు ఏడువ్వాలసిన అవసరముండేది గాదుగదా. ఏనాడో మహాపాపం

చెయ్యబట్టి, పసిపాపల ఆకలిబాధయినా తీర్చలేని అసమర్థుణ్ణయ్యాను. పెద్దపిల్లకు జ్ఞానమొచ్చింది. చిన్నవాడసలే నోరెరుగడు! నేను కనుపించక పోవడంవల్ల వాళ్ళెంతగా యేడుస్తున్నారోగదా! ఆ ప్రాణాలు రెండూ యింకా నిలచి వున్నాయో, లేక ఆకలిబాధతో అప్పుడే కడతేరిపోయాయో! ఏమయి పోతే యెవరికి గావాలి? ఆ బిడ్డల నీ విధంగా చేసినందుకు స్వర్గధామంలో వున్న వాళ్ళ తల్లి నన్నెన్నివిధాల శపిస్తూందో గదా!

అయ్యో భగవంతుడా! ఈదారుణమైన దుఃఖాగ్నితో ఈ హృదయం భగభగమండి పోదేమిరా తండ్రీ! నే నీ చెరసాలలోనుంచి విడుదలయ్యే దెప్పుడు! నా బిడ్డలు కంటబడే దెప్పుడు? అసంభవం. నాబిడ్డలకూ నాకూ అప్పుడే ఋణం చెల్లిపోయింది! ఇక నా బిడ్డ లెక్కడ? నే నెక్కడ?

పాలడబ్బా తెస్తానని చెప్పాను. డబ్బులు బియ్యము - తప్పక తీసుకొస్తానని పెద్ద పిల్లతో చెప్పాను. నే నెంతకూ తిరిగి వెళ్ళక పోవడమును గురించి అ దేమను కొంటుంది? ఏ కారు కిందయినా పడి తన తండ్రి చచ్చి పోయినా డనుకొంటుందో లేక తమ ఆకలి బాధను తీర్చడం చేతగాక ఎక్కడి కయినా పారిపోయినాడే అనుకుంటుందో!

ఏమనుకొన్నా తనకు చేతనయినంత వరకూ చిట్టిగాణ్ణి సముదాయిస్తుంది. వా డూరుకోడు. నాకు తెలుసు. అప్పుడు అమ్మకు కూడా నాకోసం ఏడుస్తూ కూర్చుంటుంది. ఆ పిల్లల యేడుపు నెవరయినా వింటారా? తమ యింట్లోకి తీసుకపోయి పట్టెడన్నము పెడతారా? హా! నా పిచ్చి! ఆవీధిలో ఆమాత్రం దయామయు లెవరున్నారు? నారాక కోసం ఎదురు చూసిచూసి ఆరాత్రంతా యేడిచేడిచి, ఆకలి మంటలో అలమటించి అలమటించి - చనిపోయి వుంటారు."

అన్న ఆలోచనలు జైలులోవున్న గోపన్న హృదయానికి తట్టేటప్పటికి అతని రెండు కళ్లనుంచీ అంతులేని కన్నీటి ధారలు ప్రవహించడం మొదలు పెట్టాయి. అతని హృదయం వేయిరంపాలతో కోసినట్లయి పోతోంది. భరించలేని ఆదారుణ దుఃఖాగ్ని జ్వాలలతో

బ్రతికడంకంటే, తలను నేలకేసి కొట్టుకొందామా అన్నంతటి విరక్తి కలిగిం దాతనికి.

డ్యూటీ ప్రకారం ఒకవార్డరు పట్టెడన్నమును తెచ్చి, ప్రతి పూటా గోపన్ ముందు పెట్టి చక్కాపోతున్నాడు. కానీ అశ్రుకణాలతో నిండిన గోపన్ కడుపు కాకలిలేదు. దప్పిలేదు. ఆ అన్నం తినాలన్న జిజ్ఞాసే అతనికి లేకపోయింది. అందుచేత కొన్నిపూటల అన్నమొక మూల కుళ్ళి మురుగుతూవుంది.

లోతుకు దించుకు పోయిన కళ్ళతో - ఆకలితో అవురావురని అరుస్తున్న ప్రేగులతో - క్షీణించి పోయిన శరీరాలతో ఆ దరిద్ర జీవులు - అతని బిడ్డలు అనుక్షణమూ అతని కనుపాపల్లో మసులుతున్నారు. అహర్నిశలు అతని కదే ధ్యానం-అదే ఆలాపన నిద్దరమీద లేదు. తిండిమీద లేదు. పిల్లల గురించిన ఆలోచనలు మనసులో కొచ్చినకొద్దీ, అతనికి మతిపోతూవుంది. అతనికి తెలియకుండానే అతనికళ్ళంట సంతతధారాపాతంగా వేడినీరు కాలువలై పారుతున్నాయి.

పిచ్చివాలకమూ - పిచ్చిరూపమూ పడింది. ఆ యినప వూచల్లో నుంచి,తనకగుపిస్తూ వున్నశూన్యప్రదేశం వయిపు చూస్తూ పొంగిపొర్లి వచ్చే దుఃఖసముద్రాన్ని అణుచుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

ఇంతలో ఒకజైలువార్డరు వచ్చి అతను బంధింపబడివున్న జైలుతలుపులను తెరిచాడు. ఎందుకో గోపన్ కు అర్థంకాలేదు. ఆ వార్డరు వయిపు శూన్యంగా చూస్తున్నాడు.

“నిన్ను చూడడాని కెవరో వచ్చారు.”

అని ఆవార్డరు చెప్పడంతోనే గోపన్ మరింత తెల్లబోయాడు.

“నన్ను చూడడానికా? నాకీ ప్రపంచంలో యెవరూ లేరే!” అని ఒక వేడి నిట్టూర్పును విడిచి కళ్లనీళ్లు తుడుచు కొంటూవుండగా-

“ఏమో నాకు తెలియదు, జైలరు దొరగారిఆజ్ఞ రా!” అని గోపన్ చేతులకు యినుపసంకెళ్లు తగిలించి తన వెంట ఆవార్డరు గొనిపోయి మరియొకగదిలో ఒక కిటికీముందు నిలుచుండ చేసి, తా నాప్రక్కగానే కాచుకొని వున్నాడు.

ఆ కిటికీ కవతల అతనికి శచి ముఖం కనుపించింది.

"గోపన్" అని ఆమె డగ్గుత్తికతో అంది.

"జైలులో ఎలా వున్నానో అని పరామర్శించడానికి వచ్చావా?" అని గోపన్ ఆమెను తీక్షణంగా అడిగాడు.

"అదికాదు గోపన్! నీబిడ్డలకోసం నువ్వెక్కువగా దుఃఖ పడుతూవుంటావు. నాకు తెలుసు. అందుకని నీ పిల్లలను తీసుకొచ్చా" అంటూ శచి అంతవరకూ అక్కడ నిలుచున్న యిద్దరి పిల్లలనూ చంకలో యెత్తుకొని, కిటికీ దగ్గరగా ఎత్తి పట్టుకొంది. గోపన్ అది కలో యథార్థమో తెలుసుకోలేక పోతున్నాడు.

"నాపిల్లలు! బ్రతికేవున్నారు?" అంటూ అత డానందాశ్చర్యాలతో తనసంకెల చేతులను ముందుకు సాచి ఆ బిడ్డలను మూకశరీరాలను వాత్సల్యంతో స్పృశించాడు.

"నాన్న! నాన్న" అంటూ చిట్టిబాబు కిటికీలోనుంచి తండ్రి మీరాది కెగబ్రాకబోయినాడు.

"నాన్నా! అయ్యో! ఇక్కడున్నావేం! ఇలా అయిపోయావేం" అని అమ్మడు భయంకరరూపంతోవున్న తండ్రినయిపు నిర్ఘాంత పోయి చూడడం మొదలు పెట్టింది.

"ఆకలి మంటతో అలమటించి పోయే యీ దరిద్రగొట్టుజీవుల కింతటి భోగ మెలా కలిగింది! ఈవిలువగల దుస్తులెక్కడివి? ఈబంగారు ఆభరణా లెవ రిచ్చారు? నేను చూస్తున్నది కలా? యథార్థమా?" అని గోపన్ ఆనందోద్రేకంతో అడుగుతూ వుంటే—

"గోపన్! నువ్వు కంటున్నది కలగాదు, యథార్థమే. నువ్వు పట్టుబడి బంధింపబడినరాత్రి నేను మీయిల్లు తెలుసుకొని నీబిడ్డల నిద్దరనూ నాతో మా యింటికి తీసుకెళ్ళి పోయాను. అప్పటి నుంచీ వీరిని నాబిడ్డల కంటే యెక్కువ ఘనంగా చూసుకొంటూ నేనే సంరక్షిస్తున్నాను. ఆనాడే బిడ్డలను నీకు చూపి యీ విషయమును చెప్పాలని ప్రయత్నం చేశాను కాని పోలీసులు అందు కనుమతించలేదు.

నీకీ శిక్ష లేకండా చేయాలని లాయరుద్వారా చాలా ప్రయత్నం చేశాను. కాని నీ అంతట నువ్వే నేరమును ఒప్పుకొన్నందువల్ల యీ శిక్ష తప్పింది కాదు. నాలుగు నెలలు శిక్షపడింది.

"నాలుగు నెలలుగాదు—నే నా జన్మాంతమూ యీజైలులో వున్నా నాకిక విచారం లేదు. నాబిడ్డలు నీదగ్గరున్నారు. నువ్వు వారిని రక్షించావు. అయితే శచీ! నాయందు నీకింతటిదయ యెందుకు?"

"ఆవిషయం నాకు తెలియదు గాని గోపన్! నే నిప్పుడు నిన్ను నా ప్రాణంకంటె యెక్కువగా ప్రేమిస్తున్నాను. నీ పిల్లలు నా పిల్లలై యింతటి నుంచీ నాదగ్గర వుంటారు. వారి కెటువంటిలోటూ రాదు."

"చాలు—నే నంతకంటే అధికంగా దేనినీ కోరను. నే నీతల్లి లేని పిల్లలకు చారెడు గంజి కాచిపోయలేని నిర్భాగ్యుడ నయినందు కీపసికూన లేమయిపోయినారో అని అలమటించి పోయాను. భగవంతుడే నీలో ప్రవేశించాడు. నా దిక్కుమాలిన కూనకు ఆశ్రయమును కల్పించాడు! నా కదే పదివేలు! అని అత డానందోద్రేకంతో అని—

"అమ్మడూ! చిట్టి! ఇప్పుడు మీా రెవరి దగ్గ రున్నారూ?" అని పిల్లల నడిగాడు. చిట్టి బాబాక చిరునవ్వుతో మౌనమును వహించాడు. అమ్మడు మాత్రం—

"మేము అమ్మదగ్గరే వున్నాము నాన్నా! కావలసినన్ని బిస్కత్తులు--ఎన్నెన్నో బొమ్మలు- మీాగడ పెరుగు—ఈఅమ్మ చాలా మంచిది నాన్నా!" అని చెబుతుంటే శచి ఆపిల్లనోటికి చెయ్యడ్డంపెట్టి

"నాదగ్గర కొచ్చినప్పటి నుంచీ యీపిల్లలకు నన్ను అమ్మా అని పిలవడం అలవాటయిందంతే గోపన్—" అని శచిఎందుకోసిగ్గు పడుతూ చెప్పింది. గోపన్ ఆనందానికి మేర లేకపోయింది.

"పసిపిల్లల కేం తెలుస్తుంది?.ఎవరు చేరదీసి పోషిస్తే, వారినే అమ్మా అని పిలుస్తారు." అని శచి తిరిగి చెప్పింది.

"తల్లి లేని యీబిడ్డలకు భగవంతుడు ని న్నొక మారుతల్లిగా యేర్పరచాడు." అని గోపన్ పట్టలేని సంతోషంతో అంటున్నప్పుడు

శచి ముఖభావమును గమనించాడు. వెంటనే ముఖము నింకోవైపుకు తిప్పేసు కున్నాడు.

"గోపన్! యిలా చూడు!"

అతడామెముఖంలోకి చూడలేక చూచాడు. "నువ్వు జరిగినదంతా మరచిపోవాలి. నీబిడ్డలకు తల్లి నవుతే నేనునీకేమవుతానో చెప్పు-"

అతడామెముఖంలోకి ఆశ్చర్యంగా చూసి—

"ఏమనడాని కయినా నేను అనర్హుణ్ణే శచీ!" అని ఒక నిట్టూర్పును విడిచాడు.

"అర్హుడవని నాకు తోచినప్పుడు—?" అని ఆమె తిరిగి అడిగింది. అతడు మాటలాడ లేదు.

"పది నిమిషా లయింది. ఇక మాటలు చాలించాలి—" అని చెప్పి వార్డరు గోపన్ ను తీసుకు పోతూవుంటే— "గోపన్! అధికారులు అనుమతించి నప్పుడల్లా— పిల్లలను తీసుకొస్తుంటాలే—" అని చెప్పి శచి పిల్లలతో అప్పటి కా తావును విడిచి వెళ్ళిపోయింది.....

౬

"ఎక్కడనుంచో మెస్సేజొచ్చి పడుతుందన్నావుగా? ఏదీ?" అని లిల్లీ వికటాట్టహాసం చేస్తూ, సాగరును హేళనగా అడిగింది.

"వేసినప్లాను గొప్పదే - కానీ ఫెయిలయింది"

"అయిందీ ఫెయిలు?" అని లిల్లీ తిరిగి పకపక నవ్వింది.

"దేనికయినా రోజు రావాలి - తొందర పడకోయ్!"

"అవునవును - శచి నిన్ను లవ్ చేస్తోందన్నావుగా. ఆ విషయ మేమయిందీ?"

"అదేగా ఫెయిలయిందని చెబుతున్నాను?"

"సరి - సరి - అదేనా యేమిటి నువ్వు వేసినప్లాను?"

"ఏం? అదేమయినా తక్కువ ప్లానను కున్నావా? ఆమెకు నెలకు అయిదువేల రూపాయిలు కేవలమూ యిళ్ళ అద్దెలమీద వస్తాయి. కలకత్తాలోని ఆమె బిల్డింగులు చూస్తే కళ్లుతిరుగుతాయి. ఇంకా లెక్కలేనన్ని వెండి బంగారాలు, రెడీ కేష్!"

"నీకేం లాభం? ఆమె కెంతయినా వుంటుంది."

"ఆమె నన్ను లవ్ చేసిననాడు, అదంతా మనది కాదుటోయ్ వెర్రి వుల్లయ్యా!"

"ఆమె నీటోకీలో పడ లేదన్న విషయం తేలిపోయిందిగా"

"ఆఁ! తేలిపోయినట్లే - కాని -"

"చెప్పు."

"ఇప్పుడెందుకు, జరిగినప్పుడు చెబుతాను."

"జైలులోవున్న గోపన్‌గాడి పిల్లలిప్పుడామె దగ్గరే వుంటున్నారుటగా?"

"అవును. ఆపిల్లలను ఆమె పెంచుకొంటూవుంది. పానకంలో పుడకలాగ, ఆ గోపన్‌గాడి గొడవ మధ్యగా రాకపోయినట్లయితే ఆమె నన్ను తప్పకుండా ప్రేమించేది. ఇప్పుడామె వాడిని ప్రేమించడం వల్ల నా నోట్లో దుమ్ము పడింది."

"ఏమిటీ? శచి- గోపన్, ఆదొంగను ప్రేమించిందా?"

"ఆమె కళ్ళకు వాడు దొంగలా కనుపించడం లేదు. చేసిన నేరాన్ని ఒప్పుకున్నాడుట! అందుకని అతడామె కళ్ళకు ధర్మరాజులా అవుపిస్తున్నాడు."

"అటువంటి సందర్భంలో ఒప్పుకోక ఏం జేస్తాడు?"

"ఆమె కామాత్రం బుర్రింటేగా! పైగా అతడు చాలా బీదవాడనీ—తల్లిలేని పిల్లపోషణార్థం మాత్రమే ఒక్కసారి దొంగ పని చేశాడనీ ఆమె కతని యందెంతో సానుభూతి కూడాను."

"ఈ తమాషా మరీ బాగుంది?"

"మరేమిటను కున్నావు? గోపన్ జైలు నుంచి విడుదలయ్యాక ఆమె అతనిని పెళ్ళి చేసుకొనే ప్రోగ్రాంమీద వుంది?."

"భేషూ! ఈ కథ బలే బాగుంది. అయితే, నువ్వుకూడా ఆశచీ దేవి భవనానికి ఓకన్నం తవ్వకూడదూ! అప్పుడు నిన్నుకూడా ప్రేమిస్తుందేమో!" అని లిల్లీ అంటూ వుంటే సాగర్ పకపక నవ్వుతూ—

"నువ్వు అసాధ్యురాలులా వున్నావే!" అన్నాడు.

"ఏం?"

"నా మనసులో వున్న అసలు ప్రోగ్రాంకూడా అదే!"

"ఏమిటీ? ఆమె ఇంటికి కన్నం వేదామనే?"

"ఆహా! ఆమె నన్ను ప్రేమించనీ—ప్రేమించక పోనీ—మణుగు బంగారం దొరుకుతుంది. దాంతో మనకు దరిద్రం వొదిలి పోతుంది. కాని అందు కింకొకరి సాయం కూడా అవసరం. పై వాళ్లను నమ్మడానికి వల్లగాదు."

"పోనీ నన్ను చేర్చుకో."

"Quite Welcome! అంత కంటే యింకేం గావాలీ? మన మిద్దరమూ కలశామంటే చాలు కొండలవ్వీ యెలకను పడతాము."

"ఇద్దరికీ చెరిసగం వాటాయేనా?"

"డేంఫూల్! యిదంతా యెవరికోస మను కున్నావు? నీకోసమే. నా కేం గావాలి? అంతా నువ్వే తీసుకో, నా కేమీ అక్కర లేదు. శబ్బు లేని బేవార్సునని చెప్పకుండా బ్రతికి వున్నంత కాలమూ నన్ను దయగా చూస్తే అంతే చాలు. నేను కోరుకొనే దంతే—"

"అయితే ఆమె మేడయొక్క అనుపాను లన్నీ బాగా తెలుసు కున్నావా?"

"ఒకటోరకంగా తెలుసుకున్నాను. వస్తువు లెక్కడున్నా యో-డబ్బెక్కడుంటుందో-ఆమె పడకగది యేదో అన్నీ తెలుసుకున్నా, రెండు మూడుసా ర్లా భవనానికి వెళ్ళి."

"ప్రయత్నంమీదనే వున్నా వన్నమాట"

"లేకపోతే!"

"గోపన్ విడుదలయ్యే లోపుగా యీపని అయిపోవాలి"

"అత నింకోనెల వరకూ విడుదల కాడు."

"ఇప్పటికి మూడు మాసాలయిం దన్న మాట, అతడు శ్రీకృష్ణ జన్మస్థానం ప్రవేశించి?"

"అంతే—"

"ఈలోపుగా మనపని అవుతుందా?"

"నెలరోజుల దాకా యెందుకు? ఒక వారం రోజులలోపుగానే మనం 'సక్సీడ్' అవుతాము—"

"అయితే మంచిదే"

"ఆమె అప్పుడప్పుడు గోపన్ పిల్లలను వెంట బెట్టుకొని నాటకాలకూ సినీమాలకూ బయలుదేరుతూ వుంటుంది. అటువంటప్పుడు ఛాన్సు బాగుంటుంది"

"అవును కాని చాలా మెళుకువగా చెయ్యాలి"

"ఇటువంటి వాటిల్లో మనకు సర్వీసు లేకపోలేదు."

"నేను చెయ్యవలసిన పనేమిటి?"

"కన్నంవేసో, తాళాలు బ్రద్దలుకొట్టో, నేను లోపల ప్రవేశిస్తానుకో. అప్పుడు నువ్వు బయటవుండి - నే నందించిన సామానులను పట్టుకు పోవాలి-ఆలోపుగా యెవరయినా వచ్చినట్లయితే, నాకు సంజ్ఞ ఈయాలి."

"ఓ! యీమాత్రమయితే; చెయ్యగలను."

"నువ్వు చెయ్యవలసినదంతే లిల్లీ! నువ్వు సుకుమారివిగాబట్టి సుకుమారమయిన పనే యేర్పాటు చెయ్యాలి."

"ఒకవేళ పట్టుబడితే—?"

"ఛా! అటువంటి పిరికి ఆలోచనలను మనం దగ్గిరికే చేరనియ్యకూడదు — సాహస ముండాలి."

లిల్లీ ఏమీ మాటలాడ లేదు.

"అలా యెక్కడికయినా షికారుకు పోదాం వస్తావా లిల్లీ?"

"ఎక్కడికి పోదాం"

"నీ యిష్టం. బీచి ఒడ్డుకు పోదాం."

"అదీ డబ్బులేని పని"

"అయితే సినీమాకు పోదాం రా"

"ఏదీ నీదగ్గర కానిడబ్బయినా లేందే సినీమా కెలా తీసుకెడతావు?"

"మనకు సినిమాకు టిక్కట్టు అవసరంలేదుగా. అర్థరూపాయి

వుంది. పయిసాదరుకు సరిపోతుంది. ”

“ అయితేసరే - బస్సుకు నాదగ్గర యేమాత్రమో చిల్లరుందిలే” అని యిద్దరూ బయలుదేరారు. మరికొంత సేపటికి సినీమాహాలు చేరుకున్నారు. తీరా వెళ్ళబోతే అక్కడ ఆనాడు సినీమాకు బదులుగా నాటకం!

“ ఏంచేదాం లిల్లీ! ఈవేళ నాటకమని తెలీదు. ”

“ వచ్చిందానికే నుల్లి తేసరి ”

“ అంతేనురి. నువ్వు సినీమాకయితే టిక్కెట్టు అవసరంలేదుగాని, నాటకానికి వీల్లేదు. ”

“ నువ్వింతకంటే యెక్కువ చేస్తావని యెవరనుకున్నారు? ”

“ సరిసరి - ఆకాశంలోనుంచి దిగుతున్నా వారెవరో చూడు! శచి పిల్లలతో వచ్చినట్లుంది. ”

లిల్లీ ఆ దెసకు చూచి —

“ అవునవును, పిల్లలను తీసుకొని, నాటకాని కొచ్చినట్లుంది. ”

“ మన కిది అవకాశము నెందుకు పోగొట్టుకోవాలి? ఇప్పుడు తొమ్మిదిగంటలయింది. మన మిప్పుడు గనక వెళ్లామంటే సునాయాసంగా పని జరుగుతుంది. ”

“ మనం బయలుదేరినవేళ చాలా మంచిది. ఇక్కడనుంచే పోదామా? ”

“ ఇలా వెడితే ప్రమాదం! వెంటనే యింటికి వెళ్ళి నా నల్ల బురఖా తెచ్చుకొందాము. నీకుకూడా ఏదయినా నల్లముసుగు వుండడం అవసరం. మనల్ని ఎవరూ గుర్తుపట్టకుండా బయలుదేరాలి.”

అని చెప్పిన సాగర్ లిల్లీతో తిరిగి వెంటనే బసకు వచ్చేసి శచి బంగాళాకు కన్నం వెయ్యడానికి అవసరమయిన పరికరాలను సేకరించుకున్నాడు. ఊరంతా మాట్లు మణిగేవరకూ వుండి రమారమి ఒంటిగంటవేళ ఆదారుణకార్యానికి బయలు దేరాడు.

శచీదేవి కాపురముండే బస రెండంతస్తుల మేడ. తీరా అక్కడకు వెళ్ళాక కన్నం వెయ్య వలసిన అవసరం లేకుండానే ఒక తాడు సహాయంవల్ల మొదటి అంతస్తును ఎక్కాడు. లిల్లీ ఒక నల్లముసుగుతో

యువతల నిలుచుంది. ఉన్న పరిచారకు లందరూ కింది భాగంలోనే పడుకొనివుండడంవల్ల సాగర్ ప్రయత్నాన్నెవరూ అడ్డుకొనేవారు లేకపోయారు.

ఆయింట్లో వెండిబంగారాలన్నీ తన వశమవుతాయి గదాఅని క్రింద నిలుచున్న లిల్లీ తనలో తానే మురిసి పోతూవుంది. పైనున్న సాగర్ మూటల నెప్పుడు కిందకు వేస్తాడో అని ఆమెమోడలు పడిపోయేటట్లు పయికి చూస్తూంది. ఐదు నిమిషాలయింది-పదినిమిషాలయింది. పయినుంచి మూటలేమీ పతనం లేదు.

ఇంతలో వెనుక నుంచి వచ్చిన వారెవరో యిద్దరామె రెండు దండలూ పట్టుకొని—"ఎవరు నువ్వు?" అని గద్దించి అడిగారు. ఆమె ప్రాణాలు పిలువునా యెగిరి పోయినాయి. ఒక డామె నల్లటి మేలి ముసుగును తొలగించి చూచారు. మల్లెపువ్వుల వాసన ఘుప్పున కొట్టింది.

"ఓ! నువ్వేనా! మీసాగర్ జమిందారు గా రెక్కడ లిల్లీ?" అని ఒక డనగా వారెవరో తన్ను తెలిసివున్న వారేనని ఆమె వూహించుకొంది. కాని ఏమి చెప్పడానికి ఆమెకు నోరు రావడం లేదు.

"మేడమీద వెండి బంగారాలు చక్కబెడుతున్నాడల్లే వుందోయ్ జమిందారు" అని మరియొక్క డనగా లిల్లీ పారి పోవాలని చూసింది కాని ఆమె కంతటి ధైర్యమూ లేకపోయింది—వీలూ లేకపోయింది.

నాటకమూ బాగుండ లేదు. పిల్లలూ నిద్రలకు పడ్డారు. అందువల్ల శచీదేవి సగం నాటకంలోనే యింటికి కొచ్చి కారుదిగింది.

"ఏమండోయ్! మీయింటిని దొంగలు చక్కబెడుతున్నారు." అని ఒక పోలీసు అనగా శచి నిర్ఘాంత పోయింది. క్రిందిమాటలన్నీ పైనున్న సాగర్‌కు వినిపించాయి. మేడమీది నుంచి పారిపోవాలనే అతని ప్రయత్నం! కాని భగవంతుడింకోలా తలంచడంవల్ల అతను కిందికి ఉరికీఉరకడంతోనే కాలువిరిగింది. వెంటనే పోలీసులిద్దరూ లిల్లీతోపాటు అతనిని కూడా బంధించారు. తన యింటికి దొంగతనాని కొచ్చిన వాడు సాగర్ లిల్లీలని తెలియగానే శచీదేవి ఎంత ఆశ్చర్యపోయింది.

తన సొమ్మేమీ పోకుండా దొంగలు పట్టుబడినందుకు కామె సంతో షించింది.

ఏక్షణానికేమవుతుందో యెవరూ చెప్పలేరు గదా! సినీమాకని బయలుదేరిన నరసులు పోలీసులు ఇనపసంకెళ్ళలో తగులుకుంటా రని యెవరనుకున్నారు?

౧౦.

శచి పిల్లబిడ్డనూ కూర్చోబెట్టుకొని ముస్తాబు చేస్తూవుంటుంది.

"అమ్మా! అమ్మా! నుఁ! మన యింట్లో కెప్పుడో పండుగొస్తుం దన్నావుగా?" అని అమ్మను అడిగింది.

"అవును తల్లీ! మన కీవేళే పండుగ"

"ఈ పండుగ అందరకూ వుంటుందా?"

"అందరికీ లేదు తల్లీ! మన ఒక్కరికే"

"అయితే యిది యే పండుగ గదావు?"

"మీనాన్నగారు విడుదలయ్యే పండుగ నేటివేళనమ్మా!"

"ఆఁ! మా నాన్నగారా! యీ వేళ మనం వెళ్ళదామా? అక్కడ నుంచేనా అమ్మా విడుదలవ్వడం? అమ్మా! అమ్మా!"

ఊఁ! అక్కడ నుంచే. ఇప్పుడు మనందరూ అక్కడకు వెళ తాము-మీ నాన్నగార్ని తీసుక రావడానికి."

"కారుమీదేనా అమ్మా?"

"అవును తల్లీ! కారుమీదనే వెళతాము. అయితే నువ్వీపూట ఏమేం వస్తువులు బెట్టుకొంటావో చెప్పు."

"నేనా? చంద్రహారం! అబ్బ! అది చాలా బరువమ్మా! అంచేత గడియారం గొలుసు వేసుకొంటా"

"ఇంకా?"

"నెక్లెస్ కూడా"

"ఊఁ! చేతిగడియారం"

"తరువాత?"

"సిల్కుగౌను—బూట్లు"

"ఊఁ! అయితే మరి లేచి బాత్‌రూంలోకి వెళ్ళి సబ్బుతో ఒళ్లు

తోమి దాసీ నీళ్ళు పోస్తుంది పోయించుకురా! ఈలోపుగా బీరువాలో నుంచి నువ్వు చెప్పిన వాటి నన్నింటినీ తీసి యివతల పెడతా'' నని శచి చెప్పగా అమ్మడు ఆవిధంగా చెయ్యడానికి వెళ్ళింది.

శచికూడా ఆవేళ రోజూకంటే యెక్కువ ఖులాసాగా వుంది. పిల్లలతోపాటు శచి ఆనాటి కంతకుముందే ప్రత్యేకంగా కొత్తబట్టలు కట్టించుకుంది. ముఖకాంతిలో ప్రత్యేకత దుస్తులలో ప్రత్యేకత.

గోపన్కు కొన్ని కొత్త దుస్తులను మూటగట్టుకొని పిల్లలూ తానూ తృప్తికరంగా ముస్తాబులయిన అనంతరం జీవితంలో తా నెన్నడూ అనుభవించి యెరుగని ఆనందము నానాడు ప్రసాదించి నందుకు భగవంతుడికి తనలో తాను వెయ్యివిధాల మొక్కుకుంది. గుళ్లోస్వామికి సమర్పించ డానికి కొన్ని కొబ్బరి కాయలు—పండ్లు-నూతనవస్త్రములు మొదలయిన వాటినిపట్టించుకొని చిట్టిబాబుతోనూ అమ్మడితోనూ స్వంతకారులో బయలుదేరింది, ఖయిదీ గోపన్ను ఆహ్వానించడానికి.

శచి జైలు చేరుకొనే టప్పటి కింకా గోపన్ విడుదల కాలేదు. ఆమె అక్కడే పిల్లలతో కారులో మరి కొంతసేపు వేచివుంది.

“ఏమేఅమ్మా! ఈ వేళ నాన్నగారు విడుదల అయ్యే పండుగ రోజు అనిచెప్పావు గదూ! వా రింకా రాలేదేం?'' అనిఅమ్మడు లాపాం యింటు వేసింది.

“వస్తారు తల్లీ వస్తారు. ఇంకా వేళ కాలేదు.''

“ఇంకా యెంత సేపటి కొస్తారు?''

“మనడ్రైవరు కనుక్కొచ్చి యింకో అరగంటకు మీ నాన్న గారు విడుదల అవుతారని చెప్పాడు.''

“ఇంకో అరగంటకా అమ్మా?''

“అవునుగాని తల్లీ! మీనాన్నగారొస్తే నువ్వూ మీతమ్ముడూ నాదగ్గరవుండకుండా మీనాన్నగారితో వెళ్ళిపోతారా?'' అనిఅడుగుతూ వుంటే శచి కంఠ మెందుకో శోకరుద్ధమై పోయింది. ఈ నాలుగయిదు మాసాలలోనూ ఆపిల్లలయం దామెకు ఆమెయందా పిల్లలకూ మాతా శిశువుల ప్రేమబంధ మేర్పడింది. ఆపిల్లలను విడిచి వుండడం అసంభవ

మని ఆమె ఆలోచించింది. ఎలాగయినా పిల్లల తండ్రిని ప్రార్థించి వారు తన దగ్గరే శాశ్వతంగా వుండే ఏర్పాటును చేయాలని ఆమెసంకల్పం.

"చెప్పు అమ్మకు తల్లీ! నువ్వూ మీ తమ్ముడూ నన్ను విడిచి మీనాన్న గారితో వెళ్ళిపోతారా? మీరు లేకుండా నేను బ్రతకలేను సుమా అమ్మా!"

అమ్మాయి క్షణకాలం ఆలోచించింది.

"అయితే అమ్మా! మా నాన్నగారు నీ కేమవుతారు?" అని అడిగింది.

శచి జవాబు చెప్పలేదు.

"చెప్పు—నువ్వు మా అమ్మవయితే నీకు మానాన్న గారే మవుతారు?"

"ఏమో! నాకు తెలియదు గాని నువ్వన్నీ యిటువంటిలాప్రశ్న లడుగుతావేంతల్లీ!" అనిశచిఅంటూవుండగాయిద్దరువార్డరులుగోపన్నను జైలుయొక్క పెద్దగేటుదాకా తీసుకొచ్చి విడిచి చక్కాపోయారు.

గోపన్ ఆ చేరువలోనే వున్న కారును చూడక పోవడంవల్ల తన కనుపించిన మార్గం వెంబడి వడివడిగా నడిచి పోతూవుంటే అతనిని ముందుగా అమ్మాయి చూచింది.

"అదుగో! నాన్న—మానాన్నే—నాన్నా! నాన్నా" అని బిగ్గరగా పిలిచింది. అతను వెనుదిరిగి చూచాడు. శచికూడా ఆకారులో వుండడమును బట్టి వారు తనకోసమే వచ్చారని తెలుసుకొని నాలుగడుగులలో వారున్న కారువద్దరకు వెళ్ళాడు. అతను రాగానే శచి పిల్లల నెత్తుకొని కారు దిగింది.

అతను తన శుష్కించి పోయివున్న చేతులతో, ఇద్దర బిడ్డలనూ ఒకేసారి, శచిచంకలో నుంచి లాక్కొని, పట్టలేని ఆనందంతో హృదయానికి హత్తుకొని, క్షణమాత్రకాలం పరవశత్వమును పొందాడు.

"అబ్బ ఎన్నాళ్ళకి! నాబిడ్డలు తిరిగి యీ విధంగా న్నా చేతులలో కొస్తా రనుకోలేదు. ఈ పుణ్యమంతా నాది."

అని తనకు నమస్కరించ బోతూవున్న గోపన్ రెండు చేతులూ పట్టుకొంది శచి.

"నాదికాదు—ఈ పుణ్యమంతా భగవంతుడిది. ముందుగా ఈదుస్తులు తీసేసి, కొత్తబట్టలు కట్టుకొండి—కారులోవున్నాయి." అని శచి చెప్పగా—

"చోరీనేరానికి జైలునుంచి విడుదలయినా బికారి కింతగా గౌరవ మెందుకూ?" అన్నాడతను.

"ఇటువంటి ఆనందసమయంలో ఆ మాటలు చెప్పకండి."

"శచీ! నాబిడ్డల విషయంలోనూ—నావిషయంలోనూ నువ్వు చూపుతూవున్న ఈ కనికార ఋణం ఎలా తీరుతుందీ?"

"తీరుతుంది."

"ఎలా?"

"చెప్పనా!"

"తప్పకచెప్పు. ఈ బికారి బిడ్డలనూ, ఈ బికారినీ దయ దల్చక బోతే నీలాంటి ధనికురాలికి సాగదా! నీలాంటి దయామయురాలికి ఆజన్మాంతమూ పాదసేవచేసినా చెల్లుతుంది. చెప్పు శచీ! నే నీ ఋణాన్నెలా తీర్చుకోకలుగుతాను?"

"ప్రతివిషయంలోనూ నామాట కడ్డు చెప్పకుండా, నాకోరిక లన్నింటినీ తీరుస్తుంటే, ఆఋణం తీరిపోతుంది."

"అంతకంటే తేలికపని యింకొకటి లేదు."

"అయితే ముందుగా ఆకొత్తబట్టలు కట్టుకోండి—"

అతడు మాటలాడకుండా, కారులోకి వెళ్ళి, తనకై ఆమె తెచ్చిన విలువ దుస్తులను ధరించాడు.

అనంతరం..."మన కందరకూ యిటువంటి ఆనందమునుకలిగించిన భగవంతుని ప్రార్థించడానికి ముందుగా గుడికి వెళ్లాలి మనం.

"తప్పక వెడదాము."

అందరూ తిరిగి కారులో కూర్చున్నారు—

మార్గంలో— "మీ పిల్లలకు నేను అమ్మనయితే, మీకే

మవుతానని అమ్మకు నన్ను ప్రతిదినమూ అడుగుతూవుండేది. నేనామెకు జవాబు చెప్పలేకుండా వున్నాను—మీరయినా యిప్పుడు చెప్పండి." అని శచి అంటూవుంటే, గోపన్ ఆమె ముఖభావమును గమనించాడు. కాని ఏమీ జవాబు చెప్పలేదు.

"ఇంతవరకూ మీ బిడ్డలు నా ప్రాణానికి ప్రాణమై మెలిగారు. నేను వారి నిప్పుడు విడిచి వుండలేను."

"వుండనవసరం లేదు"

"మీరో—?" అని శచి చిరునవ్వు ముఖంతో అడిగింది. "మా నాన్నా, నువ్వూ, మేమూ, అందరము కలసి వుంటామోయ్!" అని అమ్మకు కిలకిల నవ్వుతోంది.

"అంతేగా?" అని శచి రెట్టించి అడిగింది.

"నీమాట కెదురు చెప్పనని, యిప్పుడేగదా వాగ్దానంచేశాను!"

"ఈ పిల్లలను గురించి, మన మిద్దరము భార్యాభర్తలం కావాలని, విధి నిర్ణయించాడు."

గోపన్ ఉక్కిరిబిక్కిరయి, తెల్లబోయాడు.

"నా కటువంటి అర్హత యెక్కడిది శచీ!"

"మీ అర్హతలను నిర్ణయించుకోనవలసిన వారు మీరు కారు"

గోపన్ తిరుగు జవాబు చెప్పకుండా, ఆమె కళ్లలోనికి చూస్తున్నాడు. శచి అతని దగ్గర వున్న పిల్లలను తనవద్దకి లాక్కుంది. ఇంతలో వారెక్కిన కారు సీతారాముల గుడి చేరుకొంది. అందరూ లోపలకు వెళ్లారు. కారులోవున్న కొబ్బరికాయలు - వగైరా పూజా ద్రవ్యములన్నీ వారితోనే ఆలయంలోనికి గొంపోబడ్డాయి.

శచి యొక్క చర్యలు చూస్తూంటే గోపన్‌కు అనుక్షణమూ సందేహాలు కలుగుతున్నాయి. ఆమె తనయొక్క మనోభావాన్ని గుర్తించడానికి అటువంటి యేర్పాట్లు చేస్తూ వుందేమో ననుకున్నాడు.

"గోపన్! గుళ్లో ఈ దేవుని సాన్నిధ్యాన మన మిద్దరమూ భార్యాభర్తలము కాబోతున్నాము. మన యిరువుర ప్రేమబంధానికీ యీ పిల్లలు కారకులు.

[illegible] నువ్వే
[illegible] మొదట ప్రమాణం చేస్తున్నాను. నువ్వుకూడా అలాగే చెయ్యి" అని శచి చెబుతూ వుంటే గోపన్ కెందుకో ఆనాటి ప్రసంగాన్ని మరచి పోయే అంతటి మైకం కమ్ముకొంది. అతని నోటంట ఒక్కమాటయినా రావటంలేదు. శచివంటి శ్రీమంతురాలేమిటి? తనలాంటి ఒక ఖైదీని - నిరుపేదని - పెళ్లిచేసుకోవట మేమిటి? అయినప్పటికీ అతనేమీ వాదులాడ లేదు.

శచి అతని చెయ్యిపట్టుకొని తీసు కెళ్ళి స్వామిసాన్నిధ్యంలో తన ప్రక్కగా నిలుపుకొంది. మున్నా ఆమె చంకలోనూ—చిట్టిబాబు అతని చంకలోనూ వున్నారు.

అతను ఆమె చేతిని గ్రహించాడు.

"స్వామీ! నీసాన్నిధ్యంలో, నీ సాక్షిగా ఈతన్ని భర్తగా స్వీకరిస్తున్నాను. మాయిద్దరి ప్రాణాలకూ ముడిపెట్టి ఆ జన్మాంతమూ నే నాతని సాహచర్యంలో వుండేట్లు అనుగ్రహించు తండ్రీ!" అని శచి ప్రార్థన చేసింది—

"ప్రభూ! నా అర్హతానర్హతలను నేనే గుర్తించుకోలేని మూర్ఖుణ్ణి అయినప్పటికీ, ఈ శ్రీమంతురాలు నన్ను నీ సమక్షంలో భర్తగా స్వీకరిస్తూంది. ఈ అదృష్టం నాదో, నా బిడ్డలదో తెలియదు. సర్వ విషయాలలోనూ, నే నీమెకు అనుకూలుణ్ణయ్యే యోగ్యతను ప్రసాదించు." అని గోపన్ చేసిన ప్రార్థన! ఒకానొక క్షణ మాత్రకాల మానూతనదంపతులు స్వామియెదుట నిమీలితనేత్రులై నిలుచున్నారు.

స్వామిని దర్శించ వచ్చిన వారు దంపతు లయినందుకు, ఆలయ పూజారు లాశ్చర్యపోతున్నారు.

సమాప్తము.



## 'సరస్వతి'

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

నటరాజూ పలుకుతల్లీ, కూడి కులుకగల ప్రదేశం పానుగంటివారి బుద్ధి, వారిలేఖినిలో నవ్వులపువ్వులు జాలువారుతై. ఈ సరస్వతీ నామక నాటకరాజం సరస్వతీదేవి కో చక్కని కానుక. షేక్స్పియర్ కామెడి ఆఫ్ ఎఱ్ఱర్సు' అనేనాటకం వ్రాసి ఖ్యాతి గడించాడు. అదేవిధమైన గాధను అంతచక్కగానూ సృష్టించి పానుగంటివారు అమృతత్వం పొందారు. కొన్ని గృహచ్ఛిద్రాలవల్ల అన్నా చెల్లెలూ యిల్లు వదలి వెళ్ళారు. అన్నకు ఆడవేషం, చెల్లెకి మగవేషం దాంట్లో సిద్ధించినై. స్త్రీ వేషంలో వున్న అన్నను చూచి ఓ రాచకుమారుడు వరించాడు. పురుషవేషంలో వున్న చెల్లిని చూచి ఓ రాకుమారి మోహించింది. ఆనాటకం నడపడం లోనే వుంది కవిగారి సిద్ధహస్తం.

మగవేషంలో వున్న అమ్మాయిని రాకుమారి పెళ్ళిచేసుకోమని తొందర చేస్తుంది. అప్పుడతడు తనలో

మాగమాగతో డ ముచ్చటాడినయప్పు, డంను డంధుఁ గాంచి యలరునపుడు,
కవికిఁ గాకి మనసు కలసినయప్పుడు, నాకు ఏమి గంకి నాల సాగను.

అంటాడు.

ఆడవేషంలో వున్న అన్నగారిలా వాపోతాడు.

"దొంగగ్రొన్న [illegible] తెంపులో వెలయుచుంద్రు
పురుషుడైన స్త్రీ [illegible] మగలను నాథ్న [illegible]."

ఈవిధంగా నడిచింది. ఈ నాటకం చదవటంలోనే సరసం వుంది. అర్థంచేసుకోవడంలోనే ఆనందం వుంది. వెల 1-4-0.

## 'తెనుఁగుతల్లి'

వేదాంతకవి - ప్రణీతము.

వేదాంతకవిగారు [illegible] చేసిన కృతిగాని, ప్రవహించదా, అనిపిస్తుంది వీరి నాటకం [illegible] తెనుగుతనాన్ని నిలబెట్టడానికి వారియొక్క [illegible]. ఆంధ్రభారతిపట్ల అగాధ్య[illegible] యీకవిగారి హృదయం [illegible] యీ నాటకాన్ని సృష్టించినై. ధనమదాంధుల దౌష్ట్యం, [illegible], పిశ్వదాశల ఆదరాభిమానాలూ, పునాదులుగా గల యీ నాటకం ఆంధ్రదేశంలో అన్నిచోట్లా ఆడబడ్డదే. ఆబాలగోపాలంచేతా అభిమానింపబడ్డదే. కదంత్రొక్కే కవిత్వంకావాలనుకున్నవారూ, పిడిముక్కలవంటి భావాలు కావాలనుకున్న వారూ చదివి తీరాల్సిందే. వెల 1-4-0 మాత్రము.

వలయువారు:- సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా

## శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి క్రొత్త సాంఘిక నవలలు

| | | | |
|---|---|---|---|
| ఆడమళయాళము | 0-6 | చామంతి | 0-8 |
| గుళ్ళోపెళ్ళి | 0-6 | పూబంతి | 0-8 |
| సీక్రెట్ లవర్ | 0-6 | నీవే నాభార్యవు | 0-8 |
| గుడ్డిదర్బార్ | 0-6 | నీవే నాభర్తవు | 0-8 |
| ఘోషాస్త్రీ | 0-6 | నరాంతకుడు | 0-6 |
| కత్తులబోను | 0-6 | దేవాంతకుడు | 0-6 |
| వారేవా | 0-6 | ఇల్లాలు | 0-6 |
| పటప్ | 0-6 | పుకార్ | 0-6 |
| ప్రతీకారము | 0-6 | గంగ | 0-6 |
| స్త్రీబుద్ధి | 0-6 | యమున | 0-6 |
| అబద్ధంపెళ్ళి | 0-6 | సరస్వతి | 0-6 |
| మాయలాడి | 0-6 | నరబలి | 0-6 |
| తెరచాటు | 0-6 | హాయ్‌హాయ్ | 0-6 |
| దైవమిచ్చిన భర్త | 0-6 | ఉరిస్తంభము | 0-6 |
| తలవనితలంపు | 0-6 | పిచ్చిపుల్లయ్య | 0-6 |
| రైతుపడుచు | 0-6 | పూజామందిరము | 0-6 |
| వరలక్ష్మి | 0-6 | గర్భవతి | 0-6 |
| డాక్టర్సువైఫ్ | 0-6 | జాలీలాడ్జి | 0-6 |
| మూడేముద్దులు | 0-6 | వనబాల | 0-6 |
| ఇమిటేషన్ పతివ్రత | 0-6 | తప్పనిసరి | 0-6 |
| బర్తుకంట్రోలు | 0-6 | ఫ్లవర్ గరల్ | 0-6 |
| నిన్నే పెళ్ళాడతా | 0-6 | పంతులమ్మ | 0-6 |
| పులిపిల్ల | 0-6 | సినిమాపిచ్చి | 0-6 |
| మిస్డ్‌వైఫ్ | 0-6 | మరదలుపిల్ల | 0-6 |
| గప్‌చిప్ | 0-6 | వ్యభిచారిణి | 0-6 |
| పాపం | 0-6 | ఆటబొమ్మ | 0-6 |
| పరిహారము | 0-6 | ఆషక్ | 0-6 |
| ఇంతి | 0-8 | లాసిక్ | 0-6 |

వలయువారు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

